

Plate No 23

RUSTIC MUSICIAN

# జైన (అర్హత) దర్శనం

ప్రొ॥ కొత్త సచ్చిదానంద మూర్తి

ఋషభ దేవునితో ఆరంభించి మొత్తం 24గురు తీర్థంకరులు ప్రవచించిన దర్శనం ఈ జైనదర్శనం. భారతదేశంలోని అతి ప్రాచీన దర్శనాలలో ఇది ఒకటి. ఋషభుడు 'మను'వంశానికి చెందిన 'నాభి'చక్రవర్తి కుమారుడనీ, భరత చక్రవర్తి తండ్రి అనీ, విష్ణుమూర్తి అవతారం అనీ పురాణాలు కీర్తించాయి.

కాశీరాజు అయిన అశ్వసేనుని కుమారుడు పార్శ్వనాథుడు (క్రీ.పూ. 815) 23వ తీర్థంకరుడు. గృహస్థ జీవనాన్ని, రాజవైభవాదులను వదలిపెట్టి భిక్షువుగా, జ్ఞానిగా దేశంలో సంచరిస్తూ అహింస, సత్యం, అస్తేయం (దొంగతనం చేయకపోడవం), అపరిగ్రహం (ఎవరినుంచి ఏదీ స్వీకరించకపోవడం) అనే ధర్మాలను అనుష్ఠించ మని ప్రజలకు బోధించాడు.

క్రీ.పూ. 599లో లిచ్ఛవీ సంఘానికి చెందిన 'జ్ఞాతృ' అనే క్షత్రియ వంశంలో వైశాలి నగరంలో జన్మించిన వర్ధమానుడు చివరి (24వ) తీర్థంకరుడు. ఈయన తండ్రి సిద్ధార్థుడు. గణసంస్థ సదస్యులలో (రాజులలో) ఈయన ఒకడు.

వర్ధమానుణ్ణి జ్ఞాతృ పుత్రుడు (పాళీలో 'నాతపుత్తుడు') అనీ, భవబంధాల గ్రంథులు (ముడులు) విడగొట్టిన వాడు గనుక 'నిర్గ్రంథుడు' అనీ, రాగ ద్వేషాదులను జయించినవాడు గనుక 'మహావీరుడు' అనీ కూడా అంటారు.

తల్లిదండ్రుల మరణానంతరం వర్ధమానుడు తన అన్న అనుమతితో 30 ఏళ్ల ప్రాయంలోనే ఇంటినీ, భార్యనూ వదలి, యతి అయి, 14 ఏళ్లు కఠోర తపస్సు చేసి 'కైవల్య' జ్ఞానం (సర్వజ్ఞత్వం) సాధించాడు. అంగ, మగధ, కౌశాంబి మొదలైన దేశాల రాజులకు ఈయన గురువు. అర్ధమాగధి భాషలో తన ప్రవచనాలను కొనసాగిస్తూ ఎందరినో తనకు అనుయాయులుగా చేసికొని వర్ధమానుడు తన 72వ ఏట మృతి చెందాడు.

ఈ 24గురు తీర్థంకరులూ సర్వజ్ఞులూ, రాగద్వేష రహితులూ, పరమార్థవాదులూ, పూజితులూ, సమర్థులూ అనీ, అందుచేత వారిని 'అర్హతులు' అనేవారనీ, రాగ ద్వేషాలను జయించినవారు గనుక 'జినులు' అయారనీ చరిత్ర చెబుతూంది. అర్హతులు, లేదా జినులు బోధించిన దర్శనం గనుక ఇది ఆర్హత లేదా జైన దర్శనంగా ప్రసిద్ధి పొందింది.

## దిగంబరులు – శ్వేతాంబరులు :

పార్శ్వనాథుడు 'యతులు కూడా వస్త్రధారణ చేయవచ్చును' అని భావించాడు. కాని మహావీరుని వైరాగ్యం అంతకంటె తీవ్రతరమైంది. ఆయన 'యతులు వస్త్రాలు ధరింపరాదు' అని ప్రకటించాడు.

మహావీరుని మరణానంతరం చాలా ఏళ్ల తరువాత మగధలోని జైన భిక్షువులు 'యతులు తెల్లని వస్త్రాలు ధరించవచ్చును' అని తీర్మానించారు. ఆ తీర్మానాన్ని అంగీకరించినవారు 'శ్వేతాంబరులు' అనీ, అంగీకరించనివారు 'దిగంబరులు' అనీ జైనులలో రెండు సంప్రదాయాలు ఏర్పడ్డాయి.

'కేవల' జ్ఞానం పొందినవారు ఆహారం తినరాదనీ, స్త్రీలకు (తిరిగి పురుషజన్మ ఎత్తితే తప్ప) మోక్షార్హత ఉండదనీ దిగంబర జైనుల విశ్వాసం. శ్వేతాంబర జైనులతో వారికి గల ప్రధాన భేదాలలో ఇది ఒకటి. నగ్నంగా తిరుగుతూ, పాణితల భోజనం చేస్తూ, నగ్న విగ్రహాలను పూజిస్తూ, నెమలి పింఛాలు ఎప్పుడూ చేతిలో ధరించి తమకు నమస్కరించిన వారికందరికీ మోక్షమార్గం చూపిస్తూ ఉండే మరొక జైన సంప్రదాయం వారిని 'గోప్యులు' అంటారు. వీరు కొన్ని శ్వేతాంబర సిద్ధాంతాలనూ, కొన్ని దిగంబర జైన సిద్ధాంతాలనూ అంగీకరిస్తారు.

## జైన సారస్వతం :

అర్ధమాగధి భాషలో వ్రాయబడిన 'అంగాలు' అనబడే 11 జైన ఆగమ గ్రంథాలూ, వాటిని ఆధారంగా చేసికొని రచించిన మరి 34 గ్రంథాలూ నేడు లభ్యం అవుతున్నాయి. 11 ఆగమ గ్రంథాలలోనూ 'ఆచారాంగ సూత్రం', 'సూత్రకృతాంగం', 'భగవతీ సూత్రం' మొదలైనవి ఎక్కువ ప్రచారం పొందాయి. ఈ అంగాలకు చంద్రగుప్త మౌర్యుని సమకాలికుడైన స్థూలభద్రుని అధ్యక్షత క్రింద పాటలీపుత్రంలో సమావేశం అయిన జైన భిక్షువులు స్థిరరూపం కల్పించా రని శ్వేతాంబరులు అంటారు. నిజానికి 'అంగాలు', వాటికి మూలగ్రంథాలైన 'పూర్వములు' నశించిపోయాయని దిగంబర జైనుల విశ్వాసం.

ఉమాస్వాతి, కుందకుందాచార్యుడు, సమంత భద్రుడు అనేవారు విక్రమశకం ప్రథమ శతాబ్దికి, చతుర్థ శతాబ్దికి మధ్యకాలంలో జీవించి 'తత్త్వార్థ సూత్రాలు', 'నియమసారం' మొదలైన అయిదు గ్రంథాలనూ, 'ఆప్తమీమాంస' మొదలైన గ్రంథాలనూ రచించి జైన దర్శనానికి ఒక దృఢమైన ఆధారాన్ని కల్పించారు. విక్రమశకం పంచమ శతాబ్ది తరువాత వచ్చిన సిద్ధసేనుడు, దివాకరుడు, హేమచంద్రుడు మొదలైనవారు దానిని విస్తరింపజేశారు.

## జైనదర్శన సిద్ధాంతాలు :

మహావీరుడు సంయమానికీ (సంవరానికీ), అహింసకూ, మనోవాక్కాయ కర్మలకూ (దండములకూ) ప్రాముఖ్యం ఇచ్చాడు. తపస్సు (నిరాహారం, నగ్నత మొదలైనవాటి అభ్యాసం) ద్వారా పూర్వం చేసిన పాపం నశించగా, సంయమం వలన భవిష్యత్తులోని పాపకర్మ ఫలాలు నివారింపబడుతాయి. తత్ఫలితంగా మానవుడు కాలుష్య (ఆస్రవ) రహితుడై, కర్మ నశించి, దుఃఖంనుంచి విముక్తి పొందుతాడు. శారీరక కర్మ (తపస్సు) చేత పాపం నశింపచేసి కొని 'కైవల్యం' (సర్వజ్ఞత్వం) పొందవచ్చుననీ, జడ, అజడ తత్త్వాలన్నీ సజీవాలే గనుక అన్నివిధాలైన హింసను పరిత్యజించాలనీ మహావీరుడు ప్రధానంగా బోధించాడు.

జైన దర్శనం ప్రకారం ద్రవ్యా లన్నిటినీ జీవాలు, అజీవాలు అని వర్గీకరించవచ్చును. ఆకాశం, ధర్మం, అధర్మం, పుద్గలం - ఈ నాలుగూ అజీవ తత్త్వాలు. వీటితో పాటు జీవ తత్త్వాన్ని కూడా చేర్చి వీటిని 'పంచాస్తికాయాలు' అని జైనులు అంటారు. 'అస్తి'

అంటే 'ఉన్నది'. 'కాయం' అంటే దేహం వలె వ్యాప్తి కలది. ఈ రెండు లక్షణాలూ ఉన్నవి గనుక ఇవి అస్తికాయాలు. ఈ లక్షణాలు లేనిది అనస్తికాయం. కాలం ఒక 'అనస్తికాయం'

జీవం అంటే ఆత్మ. ఇది జ్ఞానం కంటె భిన్నమూ కాదు, అభిన్నమూ కాదు, భిన్నాభిన్నమూ కాదు. జీవాలు అనేకం. జీవం సర్వవ్యాపీ కాదు, అణువూ కాదు. అది మధ్యమ పరిమాణం కలది. అంటే శరీర పరిమాణం ఎంత ఉంటుందో అంత పరిమాణంలో వ్యాపించేది. చీమ ఆత్మ చీమ శరీరం అంతే ఉంటుంది. ఏనుగు ఆత్మ ఏనుగు శరీరమంత పరిమాణం కలిగి ఉంటుంది. దీపపు వెలుతురు గది పరిమాణాన్ని బట్టి విస్తరించడం, లేదా సంకోచించడం ఎలా జరుగుతుందో అలాగే ఆత్మ కూడా తాను ఆశ్రయించిన శరీరాన్ని బట్టి పెరుగుతూ, తరుగుతూ ఉంటుంది.

ఆత్మ నిత్యం. వేరువేరు జీవులలో ఇంద్రియాల సంఖ్య వేరువేరు విధాలుగా ఉంటుంది. ఉదాహరణకు వృక్షానికి ఒక్క స్పర్శేంద్రియం మాత్రమే ఉంటుంది. చీమకు స్పర్శ, రసం, గంధం అనే మూడు ఇంద్రియాలు ఉన్నాయి. మనుష్యులలోనే స్పర్శ, రస, గంధ, దృష్టి శబ్ద, మనస్సులు అనే ఆరు ఇంద్రియాలూ సంపూర్ణంగా ఉన్నాయి.

సంసారంలో జీవులు పుట్టుతూ, గిట్టుతూ పరిభ్రమిస్తూ ఉంటారు. 'కర్మ' అనే ఆవరణ వీటిని ఆచ్ఛాదించి ఉంటుంది. తపస్సు, సంయమం మొదలైన వాటిచేత ఆ ఆవరణాన్ని ఛేదించుకొని జీవులు ముక్తిని సాధించవచ్చును. సంసారంలోని కొన్ని జీవులలో సంజ్ఞ (చైతన్యం), మనస్సు ఉండవు. కొన్ని కదల లేవు. అందుకే వాటిని స్థావరాలు అంటారు. చెట్లు , భూమి మొదలైనవి ఇలాంటివి. ఉద్దేశ్యపూర్వకంగా కదలగల జీవులను 'త్రసములు' అంటారు. ప్రపంచం 'నిగోదముల' (జీవుల గుంపుల)తో నిండి ఉంది. అనాది కాలంనుంచి ఇప్పటివరకూ రెండు నిగోదాలలోని జీవులే ముక్తిని సాధించారని జైనులు భావిస్తారు. ఇంకా ఎన్నో నిగోదాలు ఉండడంవల్ల జీవులందరూ ముక్తులై ఈ సంసారం లయం చెందడం ఎన్నటికీ జరుగదు.

## జైనుల 'ధర్మం' :

జైన దర్శనంలో 'ధర్మం' విశ్వవ్యాప్తమై ఉండే ఒక 'చాలక' (చలింపచేసే) తత్త్వం. చలనం వలననే దీని ఉనికిని అనుమానింపవచ్చును. జీవం మొదలైన ద్రవ్యాల చలనానికి 'ధర్మం' సహకారి కారణం. అంటే చేప కదలికకు నీరు కారణం అయినట్లు జీవం కదలికకు 'ధర్మం' కారణం అవుతుంది. ధర్మానికి విరుద్ధమైంది అధర్మం. 'స్థితి' (కదలిక లేని దశ) వలన దీనిని అనుమానింప వచ్చును. అలసిన బాటసారి నిలవడానికి చెట్లనీడ ఆస్కారం అయినట్లు జీవుల స్థితికి అధర్మం సహాయపడుతుంది. సృష్టి, స్థితి, లయాలకు ఈ ధర్మాధర్మాలే కారణం.

## జైనుల 'పుద్గలం' :

'పూరయంతి, గలంతి చ' (పూరించేవి, జారిపోయేవి) పుద్గలాలు. ఇది 'పుద్గల' శబ్ద నిర్వచనం. పుద్గలానికి స్పర్శ, రస, గంధ వర్ణాలు ఉంటాయి. అంటే ఇది భౌతిక పదార్థం. ఏ పదార్థాలు వృద్ధి పొందుతూ, జీర్ణం అవుతూ, చివరికి నశించిపోతూ ఉంటాయో అవి పుద్గలాలు. అత్యంత సూక్ష్మాలూ, నిరవయవాలూ (విభాగాలు లేనివి), అవిభాజ్యాలూ అయిన పుద్గలాలను 'అణు' పుద్గలాలు అంటారు. వీటి సంయోగంచేత 'సంఘాత' పుద్గలాలు

ఏర్పడుతాయి. శరీరాదులన్నీ సంఘాత పుద్గలాలే. 'కర్మ' కూడా ఒక పుద్గలమే. అంటే భౌతిక పదార్థమే! ఇదే జీవులను ఆచ్ఛాదించి వారిని దుఃఖమయ ప్రపంచంలో ఉంచుతూంది. దీనిచేతనే 'జ్ఞానం' మొదలైనవి కప్పబడిపోయి, 'మోహం' మొదలైనవి ఉత్పన్నం అవుతాయి. కర్మ మూలంగానే జీవులకు దేహ సంబంధం, సంసార బంధం ఏర్పడుతున్నాయి.

జీవులలోకి కర్మ ప్రవహించడాన్ని 'అస్రవం' అంటారు. కాలువలోకి నీరు వచ్చినట్లు మనోవాక్కాయ క్రియలచేత రాగాదులు (అనురాగం, ద్వేషం మొదలైనవి), వాటి ఫలితంగా కర్మ పుద్గలం జీవులలో ప్రవేశిస్తుంది. ఈ ఆస్రవమార్గాన్ని అరికట్టి కర్మలను ఇంక చేరకుండా చేయడమే 'సంవరం' (సంయమం) అనబడుతుంది. మనోవాక్కాయక్రియలను రక్షించుకోడాన్ని 'గుప్తి' అంటారు.

ప్రాణిరక్ష, హితకరమైన ప్రియమైన భాషణం, శుద్ధ భిక్షపై జీవించడం, వస్తువులను ఉపయోగించేటప్పుడు సర్వదా జీవహింస చేయకుండా ఉండడం, ప్రపంచాన్ని వదలిపెట్టడం (త్యాగం) - ఈ అయిదింటిని 'సమితి' అంటారు. వీటి అభ్యాసమే 'సంవరం'. ఇది మానసికం, కాయికం, వాచికం అని మూడు విధాలు. 'అస్రవం' భవహేతువనీ, 'సంవరం' మోక్ష కారణమనీ ప్రధానంగా జైన ధర్మం బోధిస్తూంది.

పూర్వ జన్మలనుండి సంక్రమించిన సంచిత కర్మలను 'నిర్జరణం' (నాశనం) చేయడాన్ని 'నిర్జరం' అంటారు. వెంట్రుకలు పీకుకోడం, నగ్నంగా శీతాతపాలను సహించడం మొదలైన తపస్సులచేత ఈ నిర్జరం సిద్ధిస్తుంది. దీనివలన సంచిత కర్మలు నశించిపోయి, బంధహేతువు తొలగిపోతుంది.

## జైనుల మోక్షం :

జైనదర్శనంలో కర్మలు పూర్తిగా క్షయించి పోవడమే మోక్షం. మోక్షం పొందిన జీవులు అనంతమైన జ్ఞానంతో, అనంతమైన సుఖాలతో దేదీప్యమానులుగా ఉంటారు. ముక్తులైన వారు 'అనంత జ్ఞానం', 'అనంత వీర్యం', 'అనంత శ్రద్ధ', 'అనంతశాంతి' అనే 'అనంత చతుష్టయాన్ని' అనుభవిస్తూ ఉంటారు. ఈ స్థితిని కేవలావస్థ, లేక 'కైవల్యం' అంటారు. బద్ధావస్థలో ఇది ఆచ్ఛాదితమై ఉండి మలలిప్తం (కాలుష్య పూరితం) అవుతుంది.

ముక్తులు ఇతర జీవుల శ్రేయస్సుకోసం పాటుపడుతారు. చివరకు లోకాకాశాన్ని దాటి సిద్ధుల నివాసస్థానాన్ని చేరుకుంటారు. దుఃఖం లేకపోవడం, అనంతమైన, అసమిశ్రితమైన సుఖం - ఇదే జైనుల మోక్షం! సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్రం - ఈ మూడూ మోక్షమార్గాలు. తీర్థంకరులు ప్రవచించిన తత్త్వార్థాలలో శ్రద్ధ సమ్యక్ దర్శనం. జైన శాస్త్రాలు ప్రతిపాదించిన తత్త్వాల సత్యత్వాన్ని నిశ్చయంగా తెలుసుకోడం సమ్యక్ జ్ఞానం, సదాచారాన్నీ, సచ్ఛీలాన్నీ 'సమ్యక్ చారిత్రం' అంటారు. అహింస, సత్యం, అస్తేయం (దొంగిలించకపోవడం), బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనే అయిదు మహావ్రతాల అనుష్ఠానమే సమ్యక్ చారిత్రం. యతులైనవారు వీటిని చాలా నియమ నిష్ఠలతో పాటించాలి.

## స్యాద్ వాదం :

ప్రతి వస్తువుకీ అనంతమైన ధర్మాలు ఉంటాయి. వాటి నన్నిటినీ తెలుసుకోడం 'కేవల' జ్ఞానాన్ని సాధించిన అర్హతులకే సాధ్యం అవుతుంది. సామాన్యులు వస్తువు తాలూకు కొన్ని ధర్మాలను మాత్రమే తెలుసుకోగలరు. ఇలా సాపేక్షంగా, పాక్షికంగా వస్తు ధర్మాన్ని తెసుకో డాన్ని 'నయం' అంటారు. అంటే - వస్తువు తాలూకు పాక్షిక ధర్మాలకు సంబంధించిన జ్ఞానం 'నయం'. వస్తువుల అనంతమైన ధర్మాలను గూర్చిన జ్ఞానం సామాన్యులకు సాధ్యం కాదు గనుక వారు తాము గ్రహించిన ఏ జ్ఞానాన్ని అయినా 'ఇది అయి ఉండవచ్చును' అని మాత్రమే ప్రకటించాలి; నిశ్చితంగా తెలుపడానికి వీలులేదు. 'స్యాత్' అనే సంస్కృత పదానికి అర్థం 'అయి ఉండవచ్చును' అని. ఏ విషయాన్ని అయినా 'స్యాదస్తి' (ఉండి ఉండవచ్చును) అని మాత్రమే చెప్పాలి.

సామాన్యులు వస్తువులను గురించి తమకు తెలిసిన జ్ఞానాన్ని ఏడు 'నయములు'గా ప్రకటించవచ్చును అని జైనదర్శనం చెబుతూంది. దీనినే 'సప్త భంగీ నయం' అంటారు.

## సప్త భంగీ నయం :

ఆ ఏడు నయములు :

1. స్యాదస్తి (ఉండి ఉండవచ్చును), 2. స్యాన్నాస్తి (ఉండి ఉండకపోవచ్చును), 3. స్యాదస్తి చ, నాస్తి చ (ఉండవచ్చును, లేకపోవచ్చును), 4. స్యాదవక్తవ్యం (నిర్వచించరానిది కావచ్చును), 5. స్యాదస్తి, స్యాదవక్తవ్యం (ఉండి నిర్వచింపరానిది కావ్చును, 6. స్యాన్నాస్తి, స్యాదవక్తవ్యం (లేకుండి నిర్వచింపరానిది కావచ్చును, 7. స్యాదస్తి చ, నాస్తి చ, స్యాదవక్తవ్యం (ఉండీ, లేకుండీ నిర్వచించపరానిది కావచ్చును).

ఉదాహరణకు మన ఎదురుగా ఉన్న ఒక కుండను గూర్చి 'ఇది ఉండి ఉండవచ్చును' అని మాత్రమే చెప్పాలి. దీని అర్థం 'ఈ సమయంలో, ఈ స్థలంలో, ఈరూపంలో కుండ ఉన్నది' అని మాత్రమే! అదే కుండను గూర్చి 'ఉండి ఉండకపోవచ్చును' అని కూడా తెలుపవచ్చును. అంటే - 'వేరొకచోట, వేరొక సమయంలో, వేరొక రూపంలో ఆ కుండలేదు' అని దాని అర్థం. ఈ రెండువిధాలైన జ్ఞానాలను కలిపి 'కుండ ఉండీ లేకపోవచ్చును' అని ప్రకటించవచ్చును. దీని అర్థం కుండ ఈ స్థలంలో, ఈ సమయంలో, ఈ రూపంలో ఉంది గాని ఇతర స్థలాలలో, ఇతర సమయాలలో, ఇతర రూపాలలో లేదు అని.

కుండను మొదట పచ్చి మట్టితో చేసినప్పుడు దాని రంగు వేరు. ఆవములో కాల్చిన తరువాత దాని రంగు వేరు. అయితే నిజమైన కుండరంగు ఏది? అది అవక్తవ్యం. నిర్వచించడానికి వీలులేనిది.

మొదటి మూడు నయాలకూ 'అవక్తవ్యం' అనే ధర్మాన్ని కూడా జోడిస్తే మరి మూడు నయాలు ఏర్పడతాయి. ఈ విధంగా ఏ వస్తువును గురించి అయినా సామాన్య మానవుడు ఈ సప్త నయముల ద్వారా (ఏడు విధాల ద్వారా) మాత్రమే చెప్పగలడు.

మిసిమి, జులై 1994

## అనేకాంత వాదం :

మొదట సంజయ వేలట్ఠి పుత్రుడు (ఈతని భౌతిక దర్శనాన్ని గూర్చి గతమాసం 'లోకాయత దర్శనాన్ని' గురించిన వ్యాసంలో సంగ్రహంగా వివరించబడింది) పరలోకం, దేవతలు, కర్మఫలం మొదలైన వాటి విషయంలో 'ఉన్నది' అని గాని, 'లేదు' అని గాని 'ఉన్నది, లేదు' అని గాని, 'లేదు, ఉన్నది' అని గాని - ఈనాలుగు విధాలలో ఏ విధంగానూ చెప్పలేము అనే ఒక వాదాన్ని లేవదీశాడు. దీనిని గూర్చి ఒకే విధంగా (ఏకాంతంగా) చెప్పలేము అని ఈవాదం ప్రతిపాదిస్తున్నందు వలన దీనిని 'అనేకాంత వాదం' అన్నారు. సంజయవేలట్ఠి పుత్రుని ఈ 'అనేకాంత వాదాన్నే' అనంతరం జైనులు గ్రహించినట్లు తోస్తుంది.

మహావీరుడు 'ఆత్మ ఉంది', 'ఆత్మ లేదు', 'ఆత్మ అవక్తవ్యం' అని మూడు విధాలుగా చెప్పడానికి వీలుందని మొదట 'త్రిభంగీ నయాన్ని' ప్రతిపాదించాడు. తరువాత అదే సప్త భంగీ నయం అయింది.

స్థూలంగా ఇదీ జైనదర్శన సారాంశం!

భాషా పరిష్కరణ : బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

('విజ్ఞాన సర్వస్వం - దర్శనములు, మతములు' అనే సంపుటం సౌజన్యంతో)

---

**By her own effort, India never emerged from the intellectual twilight of her Middle Ages which followed the downfall of Buddhism. In the sixteenth and seventeenth centuries, individual religious reformers preached devotionalism which would dispense with the priestly intermediary between God and his devotees. But their influence was local and transitory. India experienced neither a Renaissance nor a Reformation. The intellectual stagnation lasted untill the middle of the nineteenth century, when a faint echo of the modern rationalist and liberal thought reached India, to disturb it partially. During the latter half of the century, the intellectual life of the country was influenced by a number of men who preached revolt against religious orthodoxy, intellectual parochialism and social injustice. There was no great philosopher amongst them. They were social reformers. None of them thought of going behind the twilight of the Middle Ages in search of India's philosophical heritage. The attitude of the more advanced amongst those forerunners of an Indian Renaissance towards her past was negative. They drew inspiration from the West and held that India as a whole must do the same in order to emerge from mediaevalism.**

**- *M.N. ROY***

వ్యక్తిత్వవికాసం

# ఎవరిచేతిలోనూ మీరు కీలుబొమ్మ కానవసరంలేదు

– సి. నరసింహారావు

ఇతరులు బాధపడుతారని తెలిసి కూడా, మీరు కోరుకున్న రీతిలో ప్రవర్తించడం తప్పు అని, మీరు భావిస్తున్నారా? మీరు ఇతరులు ఆమోదించని పని ఏదయినా చేస్తే, కొంప మునిగిపోతుందని నమ్మతున్నారా? మీరు అభిమానించే వ్యక్తి చెప్పినట్లు చేయకపోతే, మీరు వారి అభిమానాన్ని కోల్పోవలసి వస్తుందని, భయపడుతున్నారా? ఇతరులను కష్టపెట్టడం కంటే, మన సుఖాలను కోల్పోవడమే మెరుగనుకొంటున్నారా? ఇవన్నీ పొరపాటు ఆలోచనలు

## ఎవరిచేతిలోనూ మీరు కీలుబొమ్మ కానవసరంలేదు

మీ కోసం మీరు చేసుకొనే పనుల వలన, మరెవ్వరూ గాయపడడానికి వీల్లేదు. కాని ఈ పనులను వారు, తమకు వ్యతిరేకంగా ఊహించుకోవడం వలన, వారు తలక్రిందులవడం జరుగుతుంది. పెళ్ళి అయిన తరువాత భార్యతో కలసి, వేరే కాపురం పెడతానని అంటే, తల్లితండ్రులు గాభరాపడనవసరం లేదు. కాని అతను తమను నిర్లక్ష్యం చేస్తాడేమోనని, తమ పోషణ భారాన్ని వహించడేమోనని ఊహించుకొని, తల్లితండ్రులు తలక్రిందులవడం జరుగుతుంటుంది. ఎదుటి వారు, మీరు సంతోషంగా వుండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటుంటే, వారు మిమ్మల్ని ఒత్తిడి, బలవంతం చేయరు. అలా చేయనవసరం లేదు కూడా! మీ బాగోగులను మీరు చూసుకొంటుంటే, చుట్టూ వున్నవారు మిమ్మల్ని నిరసించకపోగా ఎంతగానో అభినందిస్తారు. అలాకాక, మీరు ఇతరుల ఒత్తిడికి లొంగి మీరు కోరే రీతిలో వుండలేక పోతుంటే, అందరూ, మీరు వ్యక్తిత్వంలేనివారని ఈసడిస్తారు. మీకేం కావాలో, మీరు నిజాయితీతో చెప్పినా, ఎదుటివారు అభినందించలేకపోతే, మీ పట్ల వారికి నిజమైన ప్రేమ లేదని గుర్తించండి.

మీరు ప్రతి దానికి అవునంటూ, తల ఊపే వ్యక్తులయితే, మీకెంతటి ఇబ్బందికరంగా అనిపించినా, అలా అనకుండా వుండడం ప్రారంభించండి. మీరు స్పష్టంగా చెప్పాలనుకొన్న విషయాన్ని కూడా పైకి చెప్పలేకపోవచ్చు. ఆ సందర్భాలన్నింటినీ మీరు నోట్ బుక్‌లో వ్రాసుకోండి. ఎదుటివారితో మీ సంభాషణ ఎలా వుండాలనుకొంటారో ఒక కాగితంపై వ్రాసుకోండి. తరువాత ఎప్పుడైనా కలసినప్పుడు, మీరు వ్రాసుకొన్న విధంగా సంభాషించడానికి, మొగమాటం లేకుండా, మీ మనస్సులోని విషయాన్ని పైకిచెప్పడానికి ప్రయత్నించండి. మీరు కోరిన విషయాన్ని ఇలా సూటిగా, నిజాయితీగా, స్పష్టంగా చెప్పగలిగితే - మీరు, విముక్తులు కావడం జరుగుతుంది.

## మిమ్మల్ని మీరే పట్టించుకోకపోతే మరెవరు పట్టించుకొంటారు?

మీ సుఖ సంతోషాల్ని గురించి పట్టించుకోకుండా ఇతరులను సంతృప్తిపరచాలని, మీకెంత ఇబ్బంది కలిగినాసరే, ఇతరులను సంతోష పెట్టడానికే మీరు నిరంతరం ప్రయత్నిస్తుంటే చుట్టూ వున్నవారు మీరంటే ఇష్టపడతారు, మిమ్మల్ని గౌరవిస్తారని అనుకొంటున్నారా? మీ అవసరాలను ప్రక్కకు త్రోసి కూడా ఎదుటివారి అవసరాలను మీరు పట్టించుకొంటుంటే - మీకు కావలసినప్పుడు వారు సాయపడగలరని మీరు భావిస్తున్నారా? ఇదంతా చాలా తప్పు.

ఇతరులను సంతోష పెట్టడానికై, ఎప్పుడూ ప్రయత్నించే వ్యక్తి, చివరకు తన అవసరాలే పట్టించుకోనివాడుగా రూపొందుతాడు. మీ అవసరాలే పట్టించుకోనప్పుడు, ఇతరులకు సాయం చేయడం మాత్రం, ఎలా సాధ్యమవుతుంది? ఇలా తమను గురించి ఏమాత్రం పట్టించుకోని వ్యక్తులను చాల కృత్రిమమైన వారని ఇతరులు పరిగణిస్తారు. ఇటువంటి వారికి క్రమంగా అందరూ దూరమవుతారు. ప్రతి ఒక్కరినీ సంతోష పెట్టడానికి ప్రయత్నించే వ్యక్తులు, మరొక ఇబ్బందికర పరిస్థితిని ఎదుర్కోవలసి వుంటుంది. ఎవరైనా కొద్దిగా విమర్శించినా మీరు తట్టుకోలేరు. ఎదుటివారి విమర్శలను, అయిష్టతలను తట్టుకోవడం, మనందరి జీవితాలలోను, ఎంతో ప్రధానం. అలా తట్టుకోగల్గడం, మనం ముందుకెదగడానికి సాయపడే, ఒక ప్రధాన అంశం. అలాగే, ఎదుటివారిని నొప్పించడమెందుకని, మీరు, మీ అభిప్రాయాన్ని పైకి చెప్పలేకపోతే, మీరు తీవ్రమైన అశాంతికి, లోనుకావలసి వస్తుంది కూడా!

మీరు, ఎక్కువగా, మీకిష్టమైన పనులే చేయడానికి ప్రయత్నించండి. ఇవి, ఒక్కోసారి, మీచుట్టూ వున్నవారిని నొప్పించవచ్చు. అయినా, ఫరవాలేదు. అలాగే, మీరేదయినా ఒక నిర్ణయాన్ని తీసుకోవలసి వచ్చినప్పుడు, మీకేది మంచిదో, ఒకటికి పదిసార్లు ఆలోచించండి. ఎన్ని నిర్ణయాలు తీసుకోవడానికి ఆస్కారం వుందో, మీరు, నోట్ బుక్‌లో వ్రాయండి. అప్పుడిక, మీరు, ఏ నిర్ణయం తీసుకోవాలో ఆలోచించవచ్చు. మీరింతకు ముందే, ఏ విషయం గురించి అయినా, ఒక నిర్ణయం, తొందరపాటుగా తీసుకొని వుంటే, దానినోసారి సమీక్షించుకోండి. మీరు అందుకు భిన్నంగా, ఏ నిర్ణయం తీసుకొనే అవకాశం వుందో, పరిశీలించండి. మీకు ఇబ్బందికరంగా వున్నా, ఇతరులను సంతోషపెట్టడానికి, మీరు ఎప్పుడెప్పుడు ప్రయత్నించుతున్నారో, మీ నోట్ బుక్‌లో వ్రాసుకోండి. ఇతరులను సంతోషపెట్టడంలో అభ్యంతరకరమైనది ఏమీ లేదు. కాని ఇతరుల అవసరాలను, మీ అవసరాలకంటే ముఖ్యమనుకోవడమే తప్పు. అలాగే, ఇతరులను నవ్వించడానికి, మిమ్మల్ని మీరు కించపరచుకోవడం పొరపాటు.

మీరు పైకి వెలిబుచ్చే అభిప్రాయాలు, కేవలం అభిప్రాయాలే కాదని, అవి వాస్తవాలని, అనుకొంటారా? ఇతరులేం చెప్పినా, మీ అభిప్రాయాలే సరైనవని, సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తారా? మీ అభిప్రాయాలే గొప్పవని, ఇతరుల వద్ద నిరూపించకపోతే, మీరు తెలివితక్కువవారని ఎదుటివారు భావిస్తారేమోనని, భయపడుతున్నారా? ఇవన్నీ పొరపాటు ఆలోచనలు.

## అభిప్రాయాలను, వాస్తవాలను కలగలపవద్దు

భిన్న అభిప్రాయాలను సహించడం, మనం చెప్పేదానికి భిన్నమైన అభిప్రాయాలను, సావధానంగా వినడం, మన ఉన్నతికి తోడ్పడుతుంది. ఎదుటివారి అభిప్రాయం మనకు నచ్చనంత మాత్రాన, వారిని హేళన చేయడం, అవమాన పరచడం ఏ పరిస్థితిలోను సమర్థనీయం కాదు. మనకు ఇష్టంలేని అంశాలనేకం వుండవచ్చు. మనకు ఇష్టం లేనంత మాత్రాన, అవన్నీ తప్పులుగా పేర్కొనడం సబబుకాదు. అభిరుచులు, అభిప్రాయాలు, విశ్వాసాలు అనేక రకాలుగా, ప్రతి ఒక్కరికీ భిన్నంగా వుండవచ్చు. వీటిని గురించి వాదించుకోవడం, మీ పంతమే నెగ్గాలనుకోవడం, తప్పు.

మనకు స్వాతంత్ర్యం ఎప్పుడు వచ్చిందన్నది ఒక వాస్తవం. దీన్ని గురించి వాదోపవాదాలకు ఆస్కారం లేదు. కాని మనదేశంలో ఏ రాజకీయ పార్టీ మంచిదన్న విషయంలో భిన్నాభిప్రాయాలు వుండవచ్చు. ఇటువంటి విషయాల గురించి చర్చ వచ్చినప్పుడు, మీరు సంయమనంతో వ్యవహరించాలి. ఎదుటివారికేమీ తెలియదని, వారిని నిందించడం, మీరు చెప్పేదే వాస్తవమని, వాదించడం

మానండి. అలాగే ఈ భిన్నాభిప్రాయాలను మీ మిత్రునికి తెలయజెప్పడానికి ప్రయత్నించండి. ఎదుటివారికేమీ తెలియదని మీరు నిందించిన ప్రతిసారీ, ఆ విషయాన్ని నోట్ బుక్ లో గుర్తించండి. అలాగే ఎదుటివారు ఉద్రేకానికి లోనై మిమ్మల్ని నిందించబోతుంటే, ఎదుటివారు విభేదించబోతున్నారని గుర్తుచేయండి. విభేదించడం, ఆవేశపూరితంగా చేయనక్కరలేదని చెప్పండి. అలాగే వివిధ సంభాషణల్లో, ఏది వాస్తవానికి సంబంధించిందో, ఏది అభిప్రాయాలకు, విశ్వాసాలకు సంబంధించిందో, విభజించి చూడడం, అలవాటు చేసుకోండి.

## జీవితాన్ని సంతోషమయం చేసుకోవడం మీ జన్మహక్కు

జీవితంలో కష్టపడి పనిచేయాలే తప్ప, ఆనందంగా వుండాలనుకోవడం సరికాదని, ఎప్పుడూ సుఖంగా వుండడానికి అలవాటుపడిన వారు ముందుకెదగలేరని, సుఖం వెనుక దుఃఖం దాగి వుంటుందని, ఈ జీవితమంతా కష్టపడితే, మరు జన్మలో ఆనందం లభిస్తుందని మీరు అనుకొంటుంటే, అది తప్పు అని, వేరే చెప్పవవసరం లేదు.

సంతోషంగా వుండటం, జీవితాన్ని ఆనందంగా గడపడం మన జన్మహక్కు. నిరంతరం కష్టపడుతూ, త్యాగాలు చేస్తూ , ఏదో సాధించగోరుతూ, అష్టకష్టాలు పడే వ్యక్తులు, తమ జీవితాన్ని, చాల నిస్సారంగా మార్చుకొంటారు. తామెంతటి సంపదను ప్రోగు చేసుకోగలిగినా, సంతోషంగా వుండలేకపోతారు. మీరు మరెవ్వరికీ హాని చేయనంతటి వరకూ, మీరు సంతోషంగా వుండడానికేమైనా చేయవచ్చు.

మీరు, మీకిష్టమైన పనిచేయకుండా, ఎప్పుడెప్పుడు వుండిపోవలసి వస్తోందో, మీ నోట్ బుక్ లో వ్రాసుకోండి. ప్రతిరోజూ, మీ విధి నిర్వహణలో ఎంత సమయం గడుపుతున్నారో, మీ ఆనందం కోసం ఎంతటి సమయాన్ని కేటాయిస్తున్నారో, గుర్తించండి. ప్రతిరోజూ ఒక గంటసేపు, మీకు బాగా ఇష్టమైన పనులే చేయడానికి, ఉద్యుక్తులు కండి. ఆనందం లభిస్తుంది గదా అని మీ ఆరోగ్యానికి హానికరమైన పనులు, చేయ ప్రయత్నించవద్దు. మీకు ఎక్కువ సంతోషం కలిగించే పనులేమిటో నోట్ బుక్ లో వ్రాసుకోండి. మీ దైనందిన కార్యక్రమంలో ఆ పనులను చేర్చడానికి ప్రయత్నించండి.

మీరే నిర్ణయం తీసుకొనే ముందయినా, దాని మంచిచెడుల గురించి సుదీర్ఘంగా చర్చించుకోవడం, పదిమందీ నడిచే బాటలోనే నడవాలే తప్ప, కొత్త పుంతలు త్రొక్కడం శ్రేయస్కరం కాదని, అనుకొంటున్నారా? అలాగే పరుగెత్తి పాలు త్రాగడం కంటే, నిలబడి నీళ్ళు త్రాగడం మంచిదనుకొంటున్నారా?

## తర్జన భర్జనలతో కాలాన్ని వెళ్ళబుచ్చవద్దు

మీరే పనిచేయాలనుకొన్నా ముందు వెనుకలు, మంచి చెడులు, ఆలోచించుకొంటూ కూర్చుంటే, మీరు జీవితంలో వెనుకబడిపోవడం జరుగుతుంది. వెనుకవెనుక మిగిల్చివేసే బద్ధకాన్ని, భయాన్ని, వదిలించుకోనంతటిసేపూ, ఏం సాధించాలన్నా సాధ్యపడదు. ప్రమాదకరమైన మార్గాన్ని ఎంచుకోవద్దు. అలాగే హానికరమైన పనులు చేయతలపెట్టవద్దు. కాని ప్రతి క్షణమూ లాభనష్టాలు బేరీజు వేసుకొంటూ కూర్చోవద్దు. కాని క్రొత్తదనాన్ని, ఆ క్రొత్తదనంతోపాటు ఎదురయ్యే సందిగ్ధాన్ని, ఎదుర్కొనడానికి భయపడకూడదు. కొత్త ఉద్యోగం కోసం ప్రయత్నించడం, లేదా క్రొత్త వ్యాపారాన్ని ప్రారంభించడం, మీ అభిప్రాయాన్ని ఖచ్చితంగా వెలువరించడం,

మీ కిష్టంలేని వ్యక్తితో మీ స్నేహాన్ని తెగతెంపులు చేసుకోవడం, కేవలం మీ చొరవవల్లనే, సాధ్యపడుతాయి - ఇలాంటి చొరవ ప్రతి సందర్భంలోనూ గైకొన గల్గితే మీ జీవితం ఎంతో ఉత్తేజపూరితంగా పరిణమిస్తుంది. ఇటువంటి చొరవ గైకొనడం, మీకు ఇబ్బందికరమే కావచ్చు. కాని చొరవ, సాహసం లేనప్పుడు జీవితంలో ఒంటరితనం, నిస్పృహే మిగులుతాయి. జీవితంలో ఏమాత్రం సాహసం చేయలేని వ్యక్తులు స్తబ్దంగా మిగిలిపోతారు. తమకేదో అదృష్టం కలసివస్తుందని, ఏదో అద్భుతం జరుగుతుందని, వారు ఎదురు చూస్తూ, పగటికలలు కంటుంటారు.

మీరింతకాలంగా చేయాలనుకొంటూ చేయలేకపోతున్న పనులేమిటో, మీ నోట్ బుక్‌లో వ్రాయండి. అవి చేయడానికి, మానసికంగా సంసిద్ధం కండి. ఎవరినైనా మీ ఇంటికి ఆహ్వానించాలను కొంటే - వెంటనే ఆ పనిచేయండి. ప్రతి రోజూ మీరు చేయాలనుకొంటూ వెనుకాడుతున్న పని, కనీసం ఒక్కటైనా చేయడం, అలవాటు చేసుకోండి. ఒక వారం రోజుల్లో మీరు ఇంతకాలంగా చేయలేకపోతున్న పనులు ఏడు చేయగలుగుతారు. ఫలితంగా మీకెంతో ఆత్మ విశ్వాసం చేకూరు తుంది.

## ఇతరుల సహాయ, సహకారాలు కోరే అధికారం మీకుంది

మీరు, ఇతరుల సహాయం కోరడం అంటే, మిమ్మల్ని మీరు లోకువ చేసుకోవడమేనని, ఎవరి సహాయసహకారాలు లేకుండా పైకి రావడమే గొప్ప, అని అనుకొంటున్నారా? ఇతరుల సహాయాన్ని అర్థించడమంటే, మీ చేతగాని తనాన్ని రుజువు చేసుకోవడమేనని భావిస్తున్నారా? ఇవి పొరపాటు అభిప్రాయాలు.

మనం ఇతరులపై నిస్సహాయంగా ఆధారపడడం లేదు. ఇతరుల సహాయాన్ని స్వీకరించడం వేరు. ఈ సమాజంలో, పరస్పర సహకారంతోనే, మనం మన కల్గుతున్నాము. మనం వుండే ఇంటిని మనం కట్టుకోలేము. మనకు కావలసిన ఆహారాన్ని మనం పండించుకోలేము. అలాగే మనకు కావలసిన దుస్తులను మనం తయారుచేసుకోలేము. ఏ వైద్యుడైనా తనకు తాను శస్త్రచికిత్స చేసుకోలేడు. మనకు ఏ పనిచేయగల సామర్థ్యమయినా వుందని, ఇతరుల సహాయ సహకారాలు అవసరంలేదని అనుకోవడం చాల తప్పు. మీకున్న ప్రతిభ ఇతరులకు లేకపోవచ్చు. అలాగే ఇతరులకుండే ప్రతిభ మనకు వుండకపోవచ్చు. ఇతరుల ప్రతిభా విశేషాలను స్వీకరించడం మనకే లాభదాయకం. ఇలా ఇతరుల ప్రతిభను అంగీకరించలేని వ్యక్తి, అందరినీ అనుమానిస్తూ, విరోధభావం వ్యక్తం చేస్తూ, తనను తాను సమర్థించుకొంటూ, అందరికీ దూరమైపోవడం జరుగుతుంది. ఇతరులను కూడగట్టగలిగిన వ్యక్తి ఏ పనైనా సమర్థవంతంగా నిర్వహించగలుగుతాడు.

ఇతరుల సహకారాన్ని అభ్యర్థించవలసిన సందర్భాలలో కూడా, కేవలం మీ అతిశయం వలన, అలా కోరిన సందర్భాలేమిటో నోట్ బుక్‌లో గుర్తుచేయండి. ఇకముందు ఎదుటివారి సహాయాన్ని అభ్యర్థించడానికి సంశయించవద్దు. మొదట్లో మీకిది చాల ఇబ్బందికరంగా వుండవచ్చు. కాని క్రమంగా ఇది మీకు ఆహ్లాదకరంగా తోస్తుంది. అలాగే, ఎవరు మీకు ఎంతగా తోడ్పడినా, వారికి తక్షణమే ధన్యవాదాలు తెలియజేయండి. అలాగే ప్రతి రోజు, మీరు ఇతరుల నుండి ఏం కోరుతున్నారో, గుర్తు తెచ్చుకొని మీ నోట్‌బుక్‌లో పొందుపరచండి. ★

---

''వ్యక్తిత్వ వికాసం'' గ్రంథంగా వెలువడింది.
దొరుకుచోటు. MINI INTERNATIONAL, 27-1-127, Eluru Road, Vijayawada-500 002

# హింసాప్రవృత్తి : సేడిజమ్

- మంచిరాజు శ్యామలరావు

మానవ సమాజంలో విధ్వంసకత్వం, క్రౌర్యం అదుపు లేకుండా పేట్రేగి ఉప్పెనలా ముంచుకొస్తున్నాయి. ఇవి కొత్తేమీ కాదు. అయితే చరిత్రగతిలో ఒక్కొక్కసారి ఒక్కొక్కర కంగా ఇవి దర్శనమిచ్చాయి. వాటిస్వరూపం అప్పటి నాగరికతా ప్రభావాన్ని బట్టి దాని నైశిత్యాన్ని బట్టీ మారుతుంటుంది. దాన్ని సరిగా అర్థం చేసుకోవాలంటే వ్యక్తులకు సంబంధించిన, వ్యక్తిత్వానికి సంబంధించిన విధ్వంసకతను అధ్యయనం చెయ్యడం ఒక్కటే సరియయిన మార్గమౌతుంది. దీన్ని మనోవైజ్ఞానిక విశ్లేషణద్వారా, దైనందిన జీవన సరళిని గమనించడం ద్వారా చెయ్యాల్సి ఉంటుంది.

సేడిజానికి సంబంధించి రెండు సూత్రీకరణలు (Concepts) అనూచానంగా వస్తున్నవి ఉన్నాయి. ఇంకొకళ్లకి బాధ కలిగించాలనే తీవ్రమైన కోరిక సేడిజమ్‌లోని ముఖ్యాంశం. దీంట్లో లైంగిక సంబంధమైన కోరిక ఉండొచ్చు, ఉండకపోవచ్చు. ఈ కోరిక సచేతనమైంది (active) కావచ్చు లేదా దానికి వ్యతిరేకమైన అచేతనమైంది (Passive) కావచ్చు. మొదటిదాన్ని సేడిజమ్ అని, రెండోదాన్ని 'మెసోకిజం' అని పేర్కొన్నారు. లియొపోల్డ్‌వాన్ శాకర్ మెసోక్ అన్న ఆస్ట్రియాదేశపు రచయిత ఈరకమైన విపరీతపు కోరికకు సంబంధించిన అనేక కథలు రాశాడు. దీంట్లో తనను తాను హింసించుకొని బాధను అనుభవించాలనే కోరిక ప్రబలంగా ఉంటుంది. అంచేత ఈరకమైన మానసిక భావనను మెసోకిజం అన్నారు. అలాగే ఇతరుల్ని హింసించి తీవ్రంగా బాధించాలనే మానసిక ప్రేరణను దీనిమీద రచనలు చేసిన మార్క్విస్ డి సేడ్ అనే ఫ్రెంచి రచయిత పేరు మీద 'సేడిజమ్' అన్నారు.

సేడిజమ్ ప్రముఖంగా లైంగిక సంబంధమైనదే ననే సూత్రీకరణ కూడా ఒకటుంది. మనోవైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు ఫ్రాయిడ్ దీన్ని మొదట్లో లిబిడో (sexual urge) ప్రేరణవల్ల కలిగిన భావనగా పేర్కొన్నాడు. ఇతరులను హింసించి బాధించాలన్న మానసిక ప్రేరణకు వెనుక - పైకి కనబడకపోయినప్పటికీ - మెదడులో అచేతనంగా ఉన్న (unconscious) లైంగిక ఉద్దీపన మాత్రమేనన్నది ఈ సూత్రీకరణలో ముఖ్యాంశం.

ఇంకొక విషయమేమిటంటే లైంగిక వక్రత్వాలలో (sexual perversions) అధికభాగం సెక్సువల్ సేడిజానికి మెసోకిజానికి సంబంధించినవే. ఈ వక్రత్వానికి లోనైన వారికే లైంగిక ఉద్రిక్తతకు, సంతృప్తికి (sexual excitation and release) ముందు వీటిప్రకోపం ఉంటుంది. వీటికి లోనయిన మనుషులకి ముందుగా స్త్రీని హింసించి బాధించాల్సిన అవసరం ఉంటుంది. ఆమెను తాళ్లతో బంధించి, కొట్టీ, కించపరచి పూర్తి లొంగుబాటును సాధిస్తాడు. సేడిస్టు. లైంగిక ఉద్రిక్తతకోసం స్త్రీని అపరిమితంగా హింసించి బాధిస్తాడు. ఒక్కోసారి తక్కువ హింసతోనే కావలసిన ఫలితాన్ని సాధిస్తాడు. చాలాసార్లు ఊహాజనితమైన సేడిస్టు భావనలు చాలు లైంగిక ఉద్రిక్తతా ప్రకోపానికి. అనేకానేకమైన పురుషులు వారి భార్యలతో పైకి

మామూలుగా సంభోగించగలుగుతారు. కాని వారి భార్యలకి తెలియని విషయమేమిటంటే లైంగిక ఉద్రిక్తతకు ముందు వారి మస్తిష్కాలను సేడిజంతో కూడిన భావనలు అలుముకుంటాయి.

ఇక, లైంగికమైన మెసోకిజమ్‌లో ఈ పద్ధతి తారుమారవుతుంది. ఉద్రిక్తత సాధించాలంటే తను తిట్లు దెబ్బలు తినాలి. బాధపడాలి. లైంగిక వక్రీకరణలుగా, సేడిజమ్, మెసోకిజమ్, ఈరెండూ కూడా పురుషుల్లోనే ఎక్కువగా కనపడతాయి. లైంగికమైన సేడిజమ్ స్త్రీలలో కంటే ఎక్కువ పురుషుల్లోనే ఉంటుంది. కాని లైంగికమైన మెసోకిజమ్ స్త్రీలలో ఎక్కువా పురుషలలోనా అనే విషయం, సరియైన 'డేటా' లేకపోవడంవల్ల ఇదమిత్థంగా తెలియదు.

సేడిజమ్ గురించి చర్చించే ముందు అది వక్రీకరణమా (perversion) కాదా అనే దానిమీద వచ్చిన కొన్ని అభిప్రాయాల్ని పరిశీలించాలి. అది 'పెర్‌వర్షన్' అయితే ఏ అర్థంలో?

కొంతమంది రాజకీయ తీవ్రవాద (radical) భావుకులకి - హెర్బర్ట్ మార్‌క్యూజ్ వంటివారికి - సేడిజాన్ని మానవలైంగిక స్వాతంత్ర్య ప్రకటనగా అభివర్ణించడం ఫ్యాషనబుల్ అయిపోయింది. దీన్ని నిరూపించడానికి కొన్ని తీవ్రవాద రాజకీయ పత్రికలు మార్క్వీస్ డి సేడ్ రచనల్ని పునర్ముద్రించాయి. సేడిజమ్ మానవవాంఛ అన్న డి సేడ్ అభిప్రాయంతో వీళ్లు ఏకీభవిస్తారు. ఈ సేడిస్టిక్, మోసోకిస్టిక్ వాంఛలు మనుషులకి ఆనందాన్నిస్తే, ఈ వాంఛల్ని తీర్చుకోడానికి స్వేచ్ఛ ఉండాలని వాళ్లంటారు. అంటే మానవుడికి నిజంగా స్వేచ్ఛ అనేది ఉంటే -

ఇది జటిలమైన విషయం. పిల్లల్ని సృష్టించడానికి కాక మిగతా ఏవిధమైన లైంగికచర్య ఐనా - అంటే ఇది కేవలం ఆనందం (pleasure) కోసమే అయినప్పుడు - అది లైంగిక వక్రీకరణ అని నిర్వచిస్తే, పైన చెప్పిన అభిప్రాయాన్ని వ్యతిరేకించే వాళ్లందరూ, ఈరకమైన 'పెర్వర్షన్స్'ను సమర్థించాల్సొస్తుంది. అయితే ఇది ఒక్కటే 'పెర్‌వర్షన్'కి నిర్వచనం కాదు. నిజానికి ఇది చాలా పాతబడిపోయిన నిర్వచనం.

స్త్రీ, పురుషుల మధ్య ప్రేమ లేనప్పుడు కూడా, లైంగిక వాంఛ, ఆనందాన్ని ఇచ్చిపుచ్చుకునే ప్రక్రియ; జీవతపు ఉనికిని ప్రకటిస్తుంది. అయితే ఒక వ్యక్తి వేరొక వ్యక్తిని కించపరుస్తూ, బాధిస్తూ, హింసిస్తూ, లొంగదీసుకుంటూ చేసిన లైంగిక చర్యలు మాత్రమే నిజమైన లైంగిక వక్రీకరణలు (sexual perversions); ఎందుకంటే అవి సృష్టి కార్యాన్ని నెరపలేకపోవడం వల్లేకాదు జీవితానికి, ప్రాణానికి దోహదం చేసే ఒక చర్యను ప్రాణాన్ని తీసివేసే చర్యగా వక్రీకరిస్తాయి కనుక. సాధారణంగా లైంగిక వక్రీకరణలనబడే కొన్ని చర్యలతో సేడిజాన్ని పోలిస్తే ఈ విషయం తేటతెల్లమౌతుంది. ఉదాహరణకు నోటితో మర్మావయవాలను స్పృశించే చర్యలు. ముద్దు పెట్టుకోవడం ఎంత 'పెర్‌వర్షన్'నో ఇదికూడా అంతే అవుతుంది. ఎందుకంటే దీనిలో ఇంకోళ్లని లొంగదీసుకోవడంగాని, కించపరచడంగాని లేవు.

మనిషికి తన వాంఛల్ని తీర్చుకోడం ప్రకృతి సిద్ధమైన హక్కు, అంచేత దానిని గౌరవించాలన్నవాదన, హేతువాదం ద్వారా, ఫ్రాయిడ్ కి పూర్వపు దృష్టికోణం నుంచి అర్థం చేసుకోవచ్చేమో. అయితే మనిషి వాంఛలు మంచికేనని అంచేత మనిషి ఆనందాన్ని వెతుక్కుంటూ పోవడమే సరియైన చర్య అని ఈవాదంలో ఇమిడి వున్న భావన. కాని ఫ్రాయిడ్

తర్వాత ఈవాదన నిస్సారమైందన్నది తేలిపోయింది. మనిషికున్న చాలా వాంఛలు నిర్హేతుకమై నవన్న విషయం మనకి తెలుసు. ఎందుకంటే అవి అతన్ని - ఇతరుల్ని కూడా - నష్టపరచి ఖచ్చితంగా ఊబిలోకి తోసేస్తాయి. అవి అతను ముందుకు సాగకుండా అడ్డుకట్టలు వేస్తాయి. కేవలం నాశనం చేయాలనే భావనతో ప్రేరణపొంది, అలా నాశనం చేస్తేనే తనకు ఆనందం లభిస్తుందన్నవాడు దాన్ని సాకుగా తీసుకుని ''ఇది నావాంఛ, నా ఆనందానికి మూలం. అంచేత నాకు విధ్వంసానికి పాల్పడ్డానికి హక్కు ఉంది'' అనలేడు. సేడిజమ్‌తో కూడిన వక్రీకరణను సమర్థించేవాళ్లు ''తాము విధ్వంసంలో, ఇతరుల్ని చంపి నాశనం చేసే కోరికవల్ల, కలిగే సంతృప్తిని సమర్థించడం లేదని, సేడిజమ్ అనేది కేవలం మనిషిలో ఉన్న లైంగిక భావన ప్రతిరూపం మాత్రమేనని, అది ఇతరవిధాలుగా లైంగిక తృప్తిని సాధించడంకంటే చెడ్డదేమీ కాదని'' వాదించొచ్చు.

ఇలా వాదించేవాళ్లు ఒక ముఖ్యమైన విషయాన్ని విస్మరిస్తారు. సేడిస్టు పద్ధతులవల్ల కామోద్దీపన కలిగే వాళ్లకు వాళ్ల వ్యక్తిత్వంలోనే సేడిజమ్ ఉంది. అంటే అతను ఇతరుల్ని హింసించి, బాధించి, కించపరచాలనే తీవ్రమైన కోరికగల సేడిస్టు . అతని సేడిస్టు వాంఛల తీవ్రతను బట్టి అతని లైంగిక ఉద్రిక్తతలు మారుతుంటాయి. ఇది కామవాంఛను రెచ్చగొట్టే అధికారవ్యామోహం, ధనవాంఛ, ఆత్మమోహం (Narcissism) వంటి లైంగికేతర ప్రేరణల కంటే వేరుకాదు. నిజానికి లైంగిక చర్య (Sexual Act) లో మనిషి వ్యక్తిత్వం బయటపడ్డట్లు , అతని ఏ ఇతర ప్రవర్తనా పరిధిలోనూ బయటపడదు.

''సేడిజమ్‌వల్ల వొచ్చిన వక్రీకరణలు, పరిపూర్ణమైనవి, ఆరోగ్యవంతమైనవి. ఎందుకంటే మనుషులందర్లోనూ నిద్రాణంగా ఉన్న సేడిజానికి ఇవి ఎవరికీ చెరుపుచేయని విధంగా ఒక 'రిలీజ్' కల్పిస్తాయనే'' వాదనకూడా కొన్నిసార్లు వినిపిస్తుంది. ఆ లెక్కన, హిట్లర్ కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపుల్లో ఉన్న గార్డులు వాళ్లలో ఉన్న సేడిజాన్ని లైంగిక సంబంధాల్లో వొదిలేసుకో గలిగితే వాళ్లు ఖైదీలపట్ల కొంత దయగా ప్రవర్తించే వాళ్లన్నమాట.

మొత్తం సేడిజం, మెసోకిజంలో లైంగిక వక్రీకరణతో కూడిన ప్రవర్తన చాలా తక్కువ భాగం మాత్రమే. లైంగికేతరమైన సేడిజమ్ ఉన్నవాళ్లు వాళ్ల తృప్తికోసం, అంటే శారీరకమైన బాధ కలిగించడానికి - ఆఖరుకు కొన్ని సందర్భాలలో చావు వచ్చేవరకు కూడా - ఏ విధమైన శక్తి అధికారంలేని ప్రాణిని - మనిషికాని, జంతువుకాని - ఎన్నుకుంటారు. అలా హింసకు - ఒకోసారి అతిక్రూరమైన హింసకు - లోనయిన వాళ్లలో యుద్ధ ఖైదీలు, బానిసలు, ఓడిపోయిన శత్రువులు, శిశువులు, రోగగ్రస్తులు (ముఖ్యంగా మానసిక రోగులు), జైళ్లలో మగ్గుతున్న వాళ్లు, నిరాయుధులైన శ్వేతేతర జాతీయులు, ఆఖరుకి కుక్కలు కూడా ఉన్నాయి. రోమ్ నగరంలో ఎన్నడో జరిగిన అతిక్రూరమైన క్రీడలనుంచి అధునాతనమైన పోలీసు యూనిట్ల వరకూ, తమ విషయాల లేదా రాజకీయ వ్యవహారాల ముసుగులో అతిదారుణమైన హింసను ఉపయోగించారు. ఒకోసారి పేదరికంలో మగ్గుతున్న ప్రజాబాహుళ్యపు వినోదం కోసం కూడా ఈ రకమైన హింసకు పాల్పడ్డారు. మానవహింసా ప్రవృత్తికి రోమ్‌లోని కొలోసియమ్ ఒక బ్రహ్మాండమైన ప్రతీక.

లైంగికేతర సేడిజమ్ ఉన్న వాళ్లలో ఎక్కువమంది చిన్న పిల్లల్ని హింసించి ఆనందాన్ని అనుభవిస్తారు. గత 10 ఏళ్ల కాలంలో జరిపిన పరిశోధనల వల్ల ఈరకం సేడిజం ఇంత

ఎక్కువగా ఉన్న విషయం బయట పడింది. గట్టిగా కొట్టి చంపడం నుంచి, కావాలని తిండి పెట్టకుండా మాడ్చడం, గట్టిగా వాచేటట్లు, ఇంకా ఇతర విధాలుగా, గాయపరచడం వరకు చిన్న పిల్లల్ని హింసించే ప్రవర్తన ఉంటుంది. ఈ పిల్లల్ని హింసించే వయస్సును అనేక పిరియడ్ లుగా విభజించవచ్చు. (1) ఏడాది నుంచి రెండేళ్ల వరకు (2) 3 ఏళ్ల నుంచి 9 ఏళ్ల వరకు ఇది రెట్టింపవుతుంది (3) 9 ఏళ్ల నుంచి 15 ఏళ్లవరకు వయసున్న పిల్లలలో ఈ రకమైన హింస తగ్గుతూ వస్తుంది. 16 ఏళ్ల వయస్సు నుంచి పోను పోను ఈరకమైన హింస పూర్తిగా మాయమౌతుంది.

అవతలి వ్యక్తి భావనల్ని ఎద్దేవాచేసి కించపరిచే మానసిక క్రూరత్వం శారీరకమైన సేడిజం కంటేకూడా చాలా ఎక్కువ. సేడిజాన్ని ఈ విధంగా ప్రయోగించడంవల్ల దీనికి పాల్పడ్డం సేడిస్టుకే రక్షణ ఉంటుంది కూడా. దీంట్లో బలప్రయోగం ఉండదు. మాటల్ని మాత్రమే ఉపయోగిస్తారు. అయితే దీనివల్ల కలిగిన మానసిక హింసవల్ల, శారీరక హింస కంటే కూడా ఎక్కువ బాధకలగవచ్చు. ఈరకమైన హింసకి ఉదాహరణలు కోకొల్లలు. తల్లిదండ్రులు పిల్లలమీద, ప్రొఫెసర్లు విద్యార్థులపైనా పైవాళ్లు కిందివాళ్ల మీద - అంటే తమని తాము రక్షించుకోలేని వాళ్లందరిమీద సేడిస్టు ఈరకమైన హింసను ప్రయోగించవచ్చు. (ఉపాధ్యాయుడు అసహాయుడైతే విద్యార్థులు కూడా సేడిస్టులుగా మారవచ్చు). పైకి నిరపాయకరంగా కనిపించే విధంగా, ఒక ప్రశ్నతో, చిరునవ్వుతో, కంగారు పెట్టే ఒక మాటతో అవతలి వాళ్లని మానసికంగా కించపరచి క్రుంగదీసే వ్యక్తులు అనేక మందికి తారసపడతారు. అలా క్రుంగదీసి అభాసుపాలు చెయ్యడం పదిమంది ముందరా జరిగితే సేడిస్టుకి మరీ మంచిది.

## అలైంగికమైన సేడిజమ్ : కొన్ని ఉదాహరణలు

లైంగికేతరమైన సేడిజానికి సంబంధించిన ఉదాహరణలు చరిత్రలో అనేకం దొరుకుతాయి. క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన కాశ్మీర్ చక్రవర్తి మిహిరకులుడు అంత ప్రసిద్ధుడైన సేడిస్టు. శ్వేతహూణ రాజైన మిహిరకులుణ్ణి భారతీయ అత్తిలాగా అభివర్ణించారు. బౌద్ధ సన్యాసుల్ని హింసించి, చంపి, వారి స్తూపాల్ని, విహారాల్ని నాశనం చేశాడు. మహా దుర్మార్గమైన క్రౌర్యానికి, దానికి దీటైన ధైర్యంగల రాజు అతను. అతను చేసిన యుద్ధాలలో అనేకమందిని ఖైదీలుగా చేసి కాశ్మీరుకు తరలి వచ్చేప్పుడు, సింధునది ఒడ్డున ఖైదీలనందర్నీ చంపించేశాడు.

అతను కాశ్మీర్ సరిహద్దు చేరుకోగానే అత్యంత బాధాపూరితమైన ఏనుగు ఘీంకారం వినిపించింది. పొరపాటున కాలుజారి ఆ ఏనుగు కొండమీంచి అగాధమైన లోయలో పడిపోయింది. దాని బాధాపూరితమైన మూలుగులు వింటుంటే అతనికి ఆనందంతో శరీరంమీది వెంట్రుకలు గరిపొడిచాయి. అతని సంతోషానికి మేర లేదు. ఆ మూలుగుని, బాధాభరితమైన యేడ్పుల్ని మళ్లీ మళ్లీ వినాలనుకున్నాడు. పర్వతాల్లాంటి వంద ఏనుగుల్ని రప్పించి వాటిని శిఖరంమీంచి లోయలోకి బలవంతాన తోయించేసి అవి బాధతో గోలపెడ్తుంటే విని సంతోషించాడు.

రాజతరంగిణి రాసిన కల్హణుడు అతని దౌష్ట్యాన్ని (సేడిజాన్ని) వర్ణిస్తూ ఇలా అంటాడు : ''మిహిరకులుడు పాల్పడ్డ క్రూరత్వాన్ని, దౌష్ట్యాన్ని పూర్తిగా వర్ణించలేదు. పాప భూయిష్టమైనదాన్ని ముట్టుకుంటే శరీరం మైలపడిపోతుంది. వాటిని గురించి మాట్లాడితే కూడా పాపం

చుట్టుకుంటుంది. అంచేత అతని ఇతర అమానుష చర్యల్ని వర్ణించలేదు...''

''గాంధార రాజ్యంలోని బ్రాహ్మణులు అతనివద్ద నుంచి అగ్రహారాల బహుమతులు తీసుకున్నారు. నిజానికి వాళ్లది కూడా మిహిరకులుడి వ్యక్తిత్వమే అయి వుండాలి. వాళ్లు నీచాతి నీచమైన బ్రాహ్మణులు'' అని వాపోతాడు కల్హణుడు.

## జోసెఫ్ స్టాలిన్

మానసిక, శారీరక హింసకు పాల్పడ్డవాళ్లలో ప్రముఖ చారిత్రక ఉదాహరణ సోవియట్ నియంత జోసెఫ్ స్టాలిన్. డి సేడ్ నవలల్లో లైంగికమైన సేడిజమ్ ఉంటే, స్టాలిన్ ప్రవర్తన, వ్యక్తిత్వం లైంగికేతరమైన సేడిజానికి సరియైన ఉదాహరణ. విప్లవం తర్వాత రాజకీయ ఖైదీలను హింసించమని ఆజ్ఞాపించిన వాళ్లలో స్టాలిన్ మొదటివాడు. అంతవరకు రష్యన్ విప్లవకారులు రాజకీయ ఖైదీలను 'టార్చర్' చేసేవాళ్లు కాదు. స్టాలిన్ హయాంలో ఎన్.కె. వి.డి. ఉపయోగించిన టార్చర్ పద్ధతులు జారిస్టు పోలీసులు ప్రయోగించిన పద్ధతుల్ని, రిఫైన్‌మెంటులోనూ క్రూరత్వంలోనూ కూడా మించిపోయాయి. కొన్నిసార్లు కొందరు ప్రత్యేక రాజకీయ ఖైదీలపై ఏరకమైన టార్చర్ పద్ధతుల్ని ప్రయోగించాలో స్టాలినే స్వయంగా నిర్దేశించేవాడు. అతను మానసికమైన సేడిజమ్‌ను ప్రయోగించి ఎక్కువ ఆనందాన్ని అనుభవించేవాడు. కొంతమందికి ఏవిధమైన ప్రమాదమూ లేదని తాను స్వయంగా హామీ ఇచ్చి తరవాత ఒకటి రెండురోజుల్లోనే వాళ్లని అరెస్టు చేయించేవాడు. ఇంక మనకే భయం లేదనుకున్న తరుణంలో అరెస్టవడం వల్ల వాళ్లకి కలిగిన షాక్ ఎంతో తీవ్రంగా ఉండేది. వాళ్లకి హామీ ఇచ్చే సమయంలోనే వాళ్లకేం జరుగబోతోందో స్టాలిన్‌కి తెలుసు. ఆ విధంగా కూడా తన సేడిజాన్నుంచి ఎంతో ఆనందాన్ని పొందగలిగేవాడు. ★

**Who would believe it? All this while we thought V.S. Naipaul. Sir V S to give him his due, was a shy and reclusive gentleman who got his highs by writing dark and bitter truths about other people's lows. But still waters run deep, and these are particularly muddy.**

**In a recent interview in the *New Yorker* magazine, Sir V S confessed to being "a great prostitute man". And was this when he was sowing his young oats? No, it was after his marriage. "There was a tremendous sexual thirst unfulfilled. And I was a very passionate man... There were many girls who were very friendly... but I didn't know how to seduce them."**

**Naipaul found that he didn't learn the art of seduction from prostitutes. But anyone could have told Sir V S that. What did his wife feel about all this? "It was almost like learning to write," Naipaul says. Ah, artistic licence! His marriage lasted 39 years, so his wife must have been an understanding type. More so because Naipaul has now admitted to having a long and passionate affair with an Argentinian, identified only as Margaret. "Margaret didn't care a damn about my work," he said. The ultimate turn-on for a celebrity: to be desired for his true, unadorned self.**

# మిథ్యాత్రయమనే నాల్గవ మిథ్య

- ప్రొఫెసర్ పి.ఎస్. శాస్త్రి

మిసిమి జూన్ పత్రికలో శ్రీ ఎస్. అంజయ్యగారు చేసిన విమర్శను చదివి నవ్వును ఆపుకోలేకపోయానన్న విషయం మాత్రం వాస్తవం. వారి వ్యాసంలో నాలాంటి జడబుద్ధి గలవారికి అర్థమైన విషయాలను వివేచిస్తాను. అద్వైత దర్శనమున, మధ్యమక దర్శనమున, F.H. Bradley వంటివారి రచనలలోను, ప్లేటో రచనలలోను కొంత నమ్మకము నాకున్నది. అలాంటి దృక్పథముతో వివేచన చేస్తున్నాను.

'అంతిమ వాస్తవికతను మనస్సు లేక చైతన్యమన్న పదానికి సమానార్థంగా కాని లేక దరిదాపు అర్థంకాని భావించవలసి ఉంటుంది' అని సెలవిచ్చారు. 'భారతీయతత్త్వశాస్త్రంలో అనేక ధోరణులు అంతిమవాస్తవాలు మనస్సు, పదార్థము అనేవి అని నొక్కి చెప్పాయి' అన్నారు. నాలాంటివారికి చెప్పలేదని నామనవి.

అద్వైత వేదాంతంలో ప్రమాణాల విషయం వచ్చినప్పుడు భాట్ట మీమాంసను, Cosmology లో సాంఖ్య దర్శనాన్ని చాలవరకు స్వీకరించారు. ప్రకృతి నుంచి పరిణామాలలోనిది మనస్సు అన్నది సాంఖ్య దర్శనము. అప్పుడు మనస్సు జడపదార్థమే. భామతీ ప్రస్థానంలో మనస్సును చైతన్యావచ్ఛిన్నంగా గుర్తించారు. వివరణ ప్రస్థానంలో మనస్సున చైతన్య ప్రతిఫలనమున్నద న్నారు. 'మనః షష్ఠానీంద్రియాణి' అని మహాభారతము కూడ మనస్సును జడపదార్థమనే గ్రహించింది. Principle of Individuality అన్న గిఫర్డ్స్ లెక్చర్స్‌లో Physical Basis of the Mind అనే ఉపన్యాసాన్ని Bosanquet ఇచ్చారు. అందులో అద్వైతులు మనస్సును ప్రకృతి పరిణామమైన జడవస్తువని చెప్పిన ధోరణిని స్వతంత్రంగా సమర్థించినారు. పార్మెనైడిస్, స్పినోజాల సిద్ధాంతాలను సరిగా అర్థం చేసుకుంటే ఒకప్పుడు తత్త్వము పదార్థంగాను, మరొకప్పుడు చైతన్యంగాను భాసిస్తుంది. మన అర్ధనారీశ్వర శిల్పంలో సగం పురుషుడు, సగం స్త్రీ అని భావిస్తే ఆ concept మృగ్యమౌతుంది. 'వాగర్థావివ సంపృక్తౌ' అని మహాకవి అన్నాడు.

అంతిమ వాస్తవం పదార్థమన్న తాత్త్విక సంప్రదాయానికి సాంఖ్యదర్శనాన్ని పేర్కొన్నారు శ్రీ అంజయ్యగారు. పురుష ప్రసక్తి లేకుండా, కేవలం ప్రకృతిని మాత్రమే చెప్పిన సాంఖ్య దర్శన మెక్కడున్నదండి? మాఠరవృత్తి, పంచశిఖాచార్య రచన, చరకుడు కూడా ఇలా చెప్పలేదు. చార్వాక దర్శనం కూడా పదార్థమే అంతిమ వాస్తవమని చెప్పిందన్నారు. జయంతుని న్యాయమంజరిలో చార్వాకులలో రెండవ తెగవారు సుశిక్షిత చార్వాకులని, వారు అనుమాన ప్రమాణాన్ని స్వీకరించారని కలదు. భవతు. ప్రకృత మనుసరామః.

సాంఖ్య దర్శనంలో, గీతలో త్రిగుణాల ప్రసక్తి ఉన్నది. సత్త్వ, రజస్, తమస్సులు గుణాలు కావని, పదార్థాలని వాచస్పతి మిశ్రుడు తన సాంఖ్య తత్త్వ కౌముదిలో సిద్ధాంతీకరించాడు. వీటిని వరుసగా కారణ, సూక్ష్మ, స్థూల శరీరాలని అర్థం చేసుకోవాలి. అప్పుడే

త్రైగుణ్య విషయావేదాః నిస్త్రైగుణ్యో భవార్జున (2.45)

అని గీతాచార్యుడు తురీయ స్థితికి పొమ్మన్నాడు.

'ఆ ఆత్మ నిశ్చయాత్' భౌతికజగత్తు అద్వైతులకు వాస్తవమే. నిర్వాణదశ వచ్చేదాకా నిజమేనని మధ్యమకులు. నిర్వాణమంటే Extinction of Life Force దీనికి మించినది ఆత్మ. అందుకే మహాపరినిర్వాణ సూత్రంలో నందునకు 'ఆత్మదీపోభవ' అని బుద్ధుడు ఉపదేశించినట్లు ఉన్నది. విశిష్టాద్వైతులకు పదార్థమన్నది ఒక విశేషణం, ఒక గుణం. కావుననే 'అశేష చిదచిద్ వస్తు శేషిణే' అని వేదార్థ చంద్రికలో రామానుజుడన్నాడు. ద్వైతులకు జడపదార్థము వాస్తవం.

'భారతీయ దర్శనాలలో అద్వైత దర్శనము సత్తా శాస్త్రము. గ్రీక్ భాషలోని onte కి సత్తా అని అర్థము. దీనిని మహా సామాన్యమని బ్రహ్మసిద్ధిలో మండన మిశ్రుడు సిద్ధాంతీకరించాడు. దీనిని కుమారిలభట్టు తన శ్లోక వార్తికంలో విమర్శించాడు. హెగెల్ వ్రాసిన లాజిక్ లోను, ఫినామినాలజీలోను దీనికి దగ్గరగా ఉన్న Concrete Universal అనే concept గా కన్పిస్తున్నది. తర్వాత సిగ్వార్ట్, లోట్జె, హార్ట్‌మన్ ల ధోరణులలో Brodley, Bosanquet, Blarshad మొదలైనవారు దీనిని సరిదిద్దినారు. ఈ Concrete Universal కొంతవరకు Transcendental Unity of apperception గా కాంట్ వివరించినది. ఇది అద్వైతులు చెప్పే సాక్షి చైతన్యం. సత్తా శాస్త్రానికి చైతన్య మాధారం.

ఆలయ విజ్ఞానాన్ని సమర్థించిన యోగాచార బౌద్ధులలో ముఖ్యుడు దిఙ్నాగుడు. తన ఆలంబన పరీక్షలో 'యదంతర్ జ్ఞేయరూపం తద్బహిర్వ దవభాసతే' అన్నాడు. Berkeley తర్వాత దీనినే Ersais percipi అని వివరించాడు. కాంట్ తెచ్చిన Copernican Revolution లో తత్త్వ శాస్త్రజ్ఞుల దృష్టిబాహ్యజగమునుంచి, ఆంతర జగానికి మారింది. వీటిని ఆధ్యాత్మిక శాస్త్రాలంటారా?

సత్తా (Being, Existence, onte) ను ఆధారంగా తీసికొనని ప్రమాణ ప్రమేయ వివేకము సరియైన సమాధానాలను ఇవ్వలేదు. ఇట్టి ఆధారం లేని తర్కం (Epistemology) శుష్కతర్కమన్నారు. అందుకే

తర్కాప్రతిష్ఠానా దన్యథానుమేయ మితిచే దేవ మతిప్రసంగః (2-1-11).

అని బ్రహ్మసూత్రము. సత్తా నాశ్రయించుకొనిన ఎపిస్టిమాలజీ జల్ప, వితండాలకే దారితీస్తుంది. బాహ్యంగా కన్పించేవాటిని Categoriesగా విభజించి చెప్పిన తర్కాన్ని విమర్శిస్తూ, వీటిని 'Bloodles Ballet of Categories' అని Bradley అన్నాడు. ప్లేటో వ్రాసిన థియాటిడస్, సోఫిస్ట్‌లను కూడా పరిశీలించవలసి ఉన్నది.

భారతీయ తత్త్వశాస్త్రంలో నైతిక రంగానికి ప్రాముఖ్యం లేకపోయిందని పాశ్చాత్య క్రైస్తవ మిషనరీ విమర్శకుల వాదం. దీనినే శ్రీ అంజయ్య గారిలాంటి వారు, దయాకృష్ణ గారు ఉట్టంకించారు.

ముందు నాల్గవ పురుషార్థమైన మోక్షాన్ని గూర్చి విచారిద్దాము.

మిసిమి, జూలై 1994

అథ అకామయమానః - యోఅకామో నిష్కామ, ఆః కామో నత స్వప్రాణా ఉత్క్రామంతి, బ్రహ్మైవ సన్ బ్ర హ్మాప్యేతి (4-4-6).

అని బృహదారణ్యకము. కామం లేని వ్యక్తి, కామం నుంచి బయట పడినవాడు, నిష్కాముడు, ఆప్తకాముడు, ఆత్మకాముడునై పునర్జన్మ నెత్తడు. బ్రహ్మలో ఐక్యము ననుభవించును. అట్టివానికి కోరికలన్నీ నశించునని ముండకోపనిషత్ (3-2-2). ఇది మోక్షావస్థకాదని అనేవారినేమనాలి?

అథమర్త్యో అమృతోభవ త్యాత్రబ్రహ్మసమశ్నుతే... అథాయమశరీరః
అమృతః ప్రాణోబ్రహ్మై వ (4-4-7).

అని బృహదారణ్యకము. 'మృత్యోర్మా అమృతం గమయ' అని ఈ ఉపనిషదనినప్పుడు అమృత శబ్దానికి మోక్షమనే అర్థము.

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకములను దశోపనిషత్తులు బుద్ధునకు చాలా పూర్వమే వచ్చినై. డాయ్సెన్ మొదలగు పండితుల అభిప్రాయములు, బెల్వాల్కార్, రనడేల రచనలు మావాదమున కాధారములు.

బ్రహ్మానుభూతిని గలవానిని గూర్చి ప్రశ్నోపనిషత్ 'ఏ తస్మాన్న పునరావర్తంతే (1-10) అన్నది. బ్రహ్మసూత్రములలో 'అనావృత్తిః శబ్దాత్' అని చివరిసూత్రము (4-4-22). 'అమృతత్వమేతి' అని 'నావర్తంతే' అని ఛాందోగ్యం (8-6-6; 8-15-1), 'న పునరావృత్తిః' అని బృహదారణ్యకము (6-2-15) చెప్పినవి.

న్యాయ దర్శనంలోని రెండవ సూత్రంలో 'అపవర్గ' శబ్దమున్నది. అపవర్గమనగా దుఃఖ రహితమైన మోక్షమని నైయాయికులు. 'అన్యచ్ఛ్రేయో అన్యదుతైవ ప్రేయన్' అని కఠోపనిషదనినప్పుడు (1-2-1) శ్రేయశ్శబ్దానికి మోక్షమని అర్థము. మోక్ష శబ్దమే కావాలనే వారికి

'తస్య తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యే అథ సంపత్స్యే' అనుఛాందోగ్య వాక్యము (6-14-2) సరైన సమాధానము. శరీరపాతము, మోక్షము ఒకే సమయమున జ్ఞానికి రాగలవని తాత్పర్యము. ఇతనికి పునర్జన్మ లేదని 'న చ పునరావర్తతే' (8-15-1) అని ఈ ఉపనిషత్తులోనే ఉన్నది.

యదాసర్వే ప్రముచ్యంతే కామయే ౽ స్య హృది స్థితాః
అథ మర్త్యో ౽ మృతో భవ త్యాత్ర బ్రహ్మ సమశ్నుతే (2-3-14)

అని కఠోపనిషత్ కామక్షయమే బ్రహ్మానుభూతి అన్నది. దీనినే బుద్ధుడు తృష్ణాక్షయమని నాడని ఆయన పోయిన రెండు శతాబ్దాలకు మొదటి సంగీతిలో తేల్చారు. 'తృష్ణాక్షయ సుఖ స్యైతేనార్హతః షోడశీంకలా'మని మహాభారతం.

మొదట మూడే పురుషార్థాలుండేవని, బౌద్ధులనుంచి మోక్షమనే నాల్గవ పురుషార్థాన్ని తీసికొన్నారని వాదించటం నిరాధారం, హాస్యాస్పదం అని స్పష్టము. భగవద్గీత చివరి అధ్యాయం మోక్ష సంన్యాస యోగమని కూడా చెప్పాలా ఈ వితండ వాదులకు?

'పురుషార్థో 2-తః శబ్దాదితి బాదరాయణః' అని బ్రహ్మసూత్రం (3-4-1). ఔపనిషద మైన ఆత్మజ్ఞానమే మోక్షమనే పురుషార్థమని ఉపనిషత్తులలోనే తెలియబడుచున్నదని బాదరా యణుని సిద్ధాంతం. 'తరతి శోక మాత్మవిత్' (ఛాం. 7-1-3), 'సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' (ముం. 3-2-9), 'బ్రహ్మవి దాప్నోతి పరం' (తై. 2-1-1), 'తస్యతావదేవచిరం యావ న్నవిమోక్ష్యే అథసంపత్స్యే' (ఛాం. 6-14-2) అను ఉపనిషత్తుల వాక్యాలు బుద్ధునకు కొన్ని వందల ఏళ్ళకు ముందే వచ్చినవి. నికాయంలోని బ్రహ్మజాలసుత్తం సామఞ్ఞ ఫల సుత్తంలను సరిగా అవగాహన చేసుకుంటే ఆనాటికే 64 తత్త్వశాస్త్ర దర్శన సిద్ధాంతాలున్నవని తెలుస్తుంది. మోక్షమే అమృతత్వం (బృ. 4-5-15).

ఉపాసనలు పురుషార్థములను సాధించుటకు కావలసిన చిత్తశుద్ధినిచ్చేవి. కామానికి లొంగి పోవటానికి కాదు (బ్ర.సూ. 3-3-63). పారివ్రజ్యాన్ని బృహదారణ్యక (4-4-22), ఛాందోగ్య (5-10-1), ముండకాది (1-2-11) ఉపనిషత్తులు చెప్పినవి. మోక్షమనేది అనుభావ రూఢమైన విద్యాఫలమని శంకర భాష్యం. 'ముక్తః ప్రతిజ్ఞానాత్' (4-4-2) అనే సూత్రానికి ఆధారవాక్యాలు - 'అశరీరం వావ సంతం నప్రియా ప్రియేస్పృశతః' (ఛాం. 8-12-1) అని మొదలై 'స ఉత్తమః పురుషః' (8-12-3) వరకు, 'య ఆత్మా అపహత పాప్మా' (ఛాం. 8-7-1) మొదలైనవి. 'భోగేనత్వితరే క్షపయిత్వా సంపద్యతే' (4-1-19) అనే సూత్రం ఛాందోగ్యంలోని 6-14-2 మీద ఆధారపడినది. సద్యో విదేహముక్తిని - మోక్షాన్ని - బుద్ధునకు పూర్వమే ఈ ఉపనిషత్ వివరించినదని మాటి మాటికి చెప్పవలసిన అవసరం లేదు.

'వ్యక్తి శ్రేయస్సు దృష్ట్యా ఈ లక్ష్యాన్ని సంస్కృతి నిర్దేశించింద'న్నారు. కఠోపనిషత్‌లో ప్రేయన్, శ్రేయన్ అనే పదాలున్నై. అక్కడ శ్రేయస్సనగా బ్రహ్మానుభూతి, మోక్షమనే అర్థము. మొదటి మూడే పురుషార్థాలను భారతీయులు స్వీకరించారనటం నిరాధారమైన ఊహాగానమని తేల్చాము. వైదిక సంప్రదాయంలో కన్పించే 'మోక్ష భావనకు మూలం సాంఖ్య, బౌద్ధ, జైన, శ్రమణ' సంప్రదాయాలనటం హాస్యాస్పదం. బౌద్ధ భిక్షువులను శ్రమణులం టారు. బౌద్ధులు వేరు, శ్రమణులు వేరు అని శ్రీ అంజయ్యగా రంటున్నారు.

ఈ శ్రమణులు సంన్యాసులు, పరివ్రాజకులు. అత్యంతప్రాచీనమైన బృహదారణ్యకోపని షత్ 'ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంత్యప్ర వ్రజంతి' (4-4-22) అని కలదు. జాబాలోపని షత్తులో 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' (4) అని ఉన్నది. బృహదారణ్యకం బుద్ధుని తర్వాత వచ్చిందని అంజయ్యగారు సెలవిస్తున్నారు. ఘోరాణి శామ్యంతు.

ఛాందోగ్యం (2-23-1) లోని 'త్రయోధర్మ స్కంధాః' అని యజ్ఞ, అధ్యయన, దానాలను మూడు స్కంధాలు చెప్పబడినవి. బౌద్ధులు స్కంధ శబ్దాన్ని ఇక్కడనుంచి తీసికొన్నారు.

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః (3-2-6).

అని ముండకోపనిషత్ సంన్యాసాశ్రమాన్ని స్తుతించింది. సంన్యాసమును తీసికొనబోతూ యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి జ్ఞానోపదేశం చేశాడని మైత్రేయీ బ్రాహ్మణాన్ని చదివే కోరికగలిగి చదివితే తెలుస్తుంది.

'అత్యంత ఆధ్యాత్మికతకు, అత్యంత అనైతికతకు మధ్య సాగుతున్న సయోధ్య'ను ప్రస్తుతించారు. ఇది అసంభవం. అత్యంత ఆధ్యాత్మికతానుభూతి కలవాడు తనను తాను చాటుకోడు. అనైతికతకు పాల్పడడు. చంద్రశేఖర భారతీ (కాంచీ పరమాచార్యులు) మావాదానికి దృష్టాంతాలు. అత్యంత ఆధ్యాత్మికత ఉన్నదని వేషం, ముసుగు వేసుకున్న బూటకపు వ్యక్తులు రచయిత దృష్టిలో ఉంటే, వారి విషయంలో వారివాదం చెల్లుతుంది. అప్పుడు 'అత్యంత ఆధ్యాత్మికత ఉన్నదని మోసం చేయువారికి' అను సవరణను శ్రీ అంజయ్యగారు చేసుకొనవలసి ఉంటుంది.

నీతి శాస్త్రం దృష్ట్యా భారతీయ తత్త్వశాస్త్రం, దర్శనం నీతి శాస్త్రాన్ని పరిత్యజించదు. నీతి, ధర్మం, ఋతం అనేవి చిత్తపారిశుద్ధ్యానికి చాల అవసరమని, మోక్ష ప్రాప్తికే అనుష్ఠేయా లని అద్వైత దర్శనం. ధర్మార్థ కామాలను నిఃస్వార్థంగా, నిష్కామంగా మోక్షానికి ఆనుషంగి కంగా స్వీకరించేది అద్వైతం. ఇక శ్రీ అంజయ్యగారికి నిరాశ కలగరాదు.

వేద ప్రామాణ్యము కేవలము ధర్మము కొరకే. 'వేదో ఽ ఖిలో ధర్మమూల' మని మనువు. ఆస్తికదర్శనా లనబడే వానికి వేదంలో కన్పించేధర్మం ప్రామాణికం. బౌద్ధులకు ధర్మమూలము లగు త్రిపిటకాలు. మహాయాన బౌద్ధులకు అష్టసాహస్రిక, పంచవింశతి సాహస్రిక, శతసాహస్రిక ధర్మ సంబంధమున ప్రామాణికములు. అట్లే జైనులకు వేరే గ్రంథాలున్నై. వీటికి విరుద్ధంగా చెప్పని స్మృతులు కూడా ధర్మాచరణకు ప్రామాణిక గ్రంథాలే. కాని పారమార్థికంగా వేదాలు కూడా అవిద్యావద్విష యాలే అన్నారు శంకరులు. ఉపనిషత్తులు ఆనాటి వారి అనుభవాలను చెప్పినై.

నైతికతకు ఆధ్యాత్మికతకు మధ్య విభజన రేఖను భారతీయ తాత్త్వికులు గీశారన్న ఆరోపణ హాస్యాస్పదం. ఇచ్చట నైతికతను, ధర్మమును వివరించాలి. ఆంగ్లంలో నైతికతను మోరాలిటీ అన్నారు. ధర్మశబ్దానికి సరిపోయేది జర్మన్ భాషలోని సిట్లిచ్‌కైట్ (Sittlichkeit) అనే పదము.

సత్యం వద. ధర్మంచర... సత్యాన్న ప్రమదితవ్యం. ధర్మాన్న ప్రమదితవ్యం (1-11-1).

సత్యాన్ని మాట్లాడాలి. ధర్మాన్ని అనుసరించాలి. ఈ రెంటిని విడనాడరాదు. ఇక్కడి 'ధర్మంచర' అనే వాక్యమే పూర్వమీమాంసలోని మొదటి సూత్రానికాధారము. పాఠ ప్రవచనాలను మరచిపోవద్దన్నారు. తైత్తిరీయంలోని పదకొండవ అనువాకం నైతికతకు, ధర్మానికి ప్రాతిపదిక. మాతాపితరులు, గురువు, అతిథి మిన్నయైనవారు. ప్రజలు మెచ్చని పనులను చేయరాదు. 'యాన్యనవద్యానికర్మాణి తాని సేవితవ్యాని' (1-11-2). ధానధర్మా లను 'శ్రద్ధయా, శ్రియా, హ్రియా, భియా, సంవిదా దేయ' మని చెప్పినారు.

ప్రస్థాన త్రయంలో భగవద్గీత ఉన్నది. కాంట్ ప్రవచించిన Categorical Imperative ని ఆయనకు ముందే దోషరహితం, భావగర్భితంగా నిష్కామకర్మ అనే రూపంలో గీత ప్రవచించింది. దీనిని Matthew Arnold ప్రశంసిస్తూ Indian Virtue of detachment అనినాడు.

ధర్మానికి నాలుగవ ప్రమాణం 'ఆత్మన స్తుష్టిరేవ చ' అని మను వనినాడు. ఇది Butler చెప్పిన Conscience Theory. దీనినే కాలిదాసమహాకవి 'ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః' అనినాడు.

'యావదధికార మవస్థితి రాధికారికాణాం' (3-3-32).

అను బ్రహ్మసూత్ర మతిముఖ్యమైనది. దీనిమీదగల శంకరభాష్యాన్ని చదివి అర్థం చేసుకుంటే కుశంకలు రావు. తన Ethical Studies లో 'My Station and its Duties' అన్న అధ్యాయంతో బ్రాడ్లే వ్రాసింది ఈ సూత్రానికి వివరణగా కన్పించగలదు.

నైతికతకు ఆధ్యాత్మికతకు అద్వైత వేదాంతులు విభజనరేఖను గీశారన్నవాదం సత్యదూర మని చెప్పటానికే ప్రస్థానత్రయము నుంచి ఆధారముల నివ్వవలసి వచ్చినది. 'లౌకికం తద్వదే వేదం ప్రమాణం త్వా ఽ త్మనిశ్చయాత్' అనే ప్రాచీన కారికలను శంకరు లుదాహరించినారు (1-1-4). సత్యమునకు, ధర్మమునకు పూర్వరూపము ఋతం.

సత్యేనోత్తభితా భూమిః సూర్యేణోత్తభితా ద్యౌ
ఋతేనాదిత్యాస్తిష్ఠంతి దివి సోమో అధిశ్రితః (10-85-1)

అని ఋగ్వేదం చెప్పినది. ఆత్మజ్ఞానం కలిగేదాకా సత్య, ధర్మ, ఋతాదులను పాటించి తీరవలెనని, అప్పుడే చిత్తశుద్ధి కలుగునని సిద్ధాంతము.

అద్వైతులకు ప్రామాణికాలు దశోపనిషత్తులు. ఆనాటి సాధకుల అనుభవాలను వివరించిన వివి. కాని వీటిని గుడ్డిగా నమ్మరాదని, అనుభవైకవేద్యం చేసుకోవాలని అద్వైతులు. సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యాలతో వీరికి నిమిత్తం లేదు. విశిష్టాద్వైతులు, ద్వైతులు మాత్రమే వీటిని కూడా గ్రహించారు.

పూర్వమీమాంసకులు వేదవాక్యాలను విధి, నిషేధ, అర్థవాదాలని విభజించారు. ఉపనిష త్తులు వీరిదృష్టిలో అర్థవాదాలు. సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యకాలలో ఈమూడు కలవు. ఉపనిషత్తులను పూర్వమీమాంస వేదసాహిత్యంలో భాగంగా పరిగణించదనటం మౌలిక గ్రంథాలతో పరిచయం లేని వారనేమాట. అంజయ్యగారూ, పూర్వమీమాంసా సూత్రాలలో ఔత్పత్తిక సూత్రాన్ని, దానిమీదున్న శాబర భాష్యాన్ని చదవగలిగితే, ఈ భావాన్ని మార్చుకుంటారని నానమ్మకం. తాత్త్విక సారమున్నదని నొక్కిచెప్పటానికే అర్థవాదాలు వచ్చినై. విధి, నిషేధ, అర్థవాదాత్మకమైన సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులనే వేద వాఙ్మయాన్ని పూర్తిగా మీమాంసకు లంగీకరించినారని శాబర భాష్యం చాటుతున్నది. ఆత్మజ్ఞానానుభూతి కలిగేదాక దశ ఉపనిషత్తులు అద్వైతులకు ప్రామాణికాలేనని, పారమార్థి కంగా అవికూడా అవిద్యావద్విషయాలేనని చతుస్సూత్రీ భాష్యం చదివితే తెలుస్తుంది. ఈ విషయంలో నేనన్న మాటలను శ్రీ అంజయ్యగారు నాకంటగట్టారు (222వ పేజీ, మొదటి మూడు పంక్తులు).

వైదిక, అవైదిక దర్శనాలని వర్గీకరించడానికి హేతువు ధర్మశాస్త్రము. వైదిక దర్శనాలలో ధర్మప్రవృత్తికి వేదాలు, వాటిని వ్యతిరేకించని స్మృతులు ఆధారమని తెలుస్తుంది. హీనయానుల ధర్మప్రవృత్తికి త్రిపిటకాలు, మహాయానికులకు ప్రజ్ఞాపారమితలు అని చాలసార్లు చెప్పాము. నైతికత ధర్మప్రవృత్తికి, వేదాలు, 'స్మృతిశీలాంశ్చ తద్విదాం' అనే దానిని దయాకృష్ణ గుర్తించకపోవడమే ఆయన వాదంలోని లోపము.

ప్రాభాకరమీమాంసకులు చెప్పిన అర్థ క్రియాకారిత్వమే పాశ్చాత్యులలో utilitarianism గా, Pragmatism గా బయలుదేరినవి.

ఉపనిషత్తులు ప్రామాణికాలు. ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధ అనే షట్ప్రమాణాలలో శబ్దమొకటి. 'అందుచేత ఉపనిషత్తులలో ఉన్న తత్త్వం తుది వాస్తవమౌతుంది' అని శ్రీ అంజయ్యగారు ఉవాచ. కాదని మేము. 'అనుభవావసానత్వాత్ బ్రహ్మజ్ఞానస్య' అని శంకరులు తుదిప్రమాణం(?) అనుమాన మన్నారు.

ఆత్మావాఅరే ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః
ఆత్మావా అరేమైత్రేయీ ద్రష్టవ్యః

అని బృహదారణ్యకంలో యాజ్ఞవల్క్యుడు దర్శనమునే పరమప్రమాణంగా స్వీకరించి నాడు. ఆత్మావగతి కలిగిన క్షణంలో ప్రమాణ ప్రమేయ వ్యవస్థకూడా అవిద్యా కల్పితమే కాగలదని అద్వైత సిద్ధాంతము. వ్యావహారిక దశలో ప్రామాణికతను తిరస్కరించదలిచితే Logic, Epistemologyలతో వాదించ వీలులేదు. 'అనధిగత, అబాధితార్థ విషయత్వం ప్రమా' అని వేదాంతపరిభాష. ప్రమాణాల ఆవశ్యకత వ్యావహారికదశలో తప్పదు. చరిత్ర అభివృద్ధి మొదలైన వాటిని వివేచించి నిర్ణయించేవి ప్రమాణాలు. ప్రమాణాలిచ్చే ప్రామాణికత నంగీకరిస్తే అభివృద్ధి ఉండదని, చరిత్ర ఉండదని శ్రీ అంజయ్యగారనటంలో వితండవాదంగా కన్పి స్తుంది. విఫలమైంది నేను కాదని, దయాకృష్ణగారని, శ్రీ అంజయ్యగారని నామనవి.

సత్తాశాస్త్ర (Ontology) దృష్ట్యా అద్వైత దర్శనం మోక్షప్రాప్తిదాకా (ఆ ఆత్మనిశ్చయాత్) భౌతికజగాన్ని అంగీకరిస్తుందని ఇదివరకే వివరించాము. భారతీయ తత్త్వదర్శనాలన్నింటి లోను భౌతికవాద ధోరణులున్నాయని చెప్పుట సత్యదూరం. తత్త్వము చిదచిద్విశిష్టమని, అచిత్ పదార్థంలోకూడా అంతర్యామి కలదని చెప్పే విశిష్టాద్వైతంలో భౌతికవాదమున్నదా? లేదుగనుకనే దయాకృష్ణ నిజాన్ని వక్రీకరించారన్నాను. యోగాచారంలో, మధ్యమకంలో, అద్వైతంలో భౌతికవాదం లేదు. దర్శనశాస్త్రంలో సత్తాశాస్త్రం (Ontology) మీద ఆధారప డిన తర్కమే (Epistemology) ప్రామాణికము గనుక సత్తాశాస్త్ర సంబంధంలేని తర్కాన్ని పైన చెప్పిన మూడు దర్శనాలు బోధించవు.

ఆలోచనబడికి, ఆలోచన శైలికి ఘనిష్ఠ సంబంధమున్నదిగనుకనే ఒక్క అద్వైత వేదాంతం లోనే బింబ ప్రతిబింబ, ఆభాసాదివాదాలు రాగలిగినై. ఏకజీవ, నానాజీవ వాదాలు బయలు దేరినై. క్రమముక్తి, విదేహముక్తి, సద్యోముక్తి, జీవన్ముక్తి వచ్చినై.

ఇంకా శ్రీ అంజయ్యగారికి నిరాశ పోలేదంటే మాలాంటి మందబుద్ధులు ఏమీ చేయలేరు. శంకరభాష్యాలు లేకపోతే ప్రస్థానత్రయం క్రీ.శ. 1000 ప్రాంతంలోనో, క్రీ.శ. 1800 తర్వాతనో వచ్చినవని కూడా వాదించగలరేమో! ఎప్పుడో నాట్యశాస్త్రాన్ని అనువదిస్తూ తెలుసుకున్న ఆరు రకాల నవ్వులకు పునర్జన్మ నిచ్చినవారు చిరస్మరణీయులు. ★

---

# డా॥ కున్హన్ రాజా

## వేదాల్ని వినూత్న దృష్టితో అధ్యయనం చేసిన ప్రముఖ సంస్కృత పండితుడు

– టి. రవిచంద్

డా॥ కున్హన్ రాజా భారతీయ సంస్కృత పండితల్లో, వైదిక పరిశోధకుల్లో సుప్రసిద్ధుడు. ఆయన కేరళ రాజకుటుంబానికి చెందిన వాడయినా, సంస్కృత సాహిత్యంలో గొప్ప కృషిచేశాడు. సాంప్రదాయక పద్ధతుల్లో ఆయన సంస్కృతాన్ని అభ్యసించాడు. మద్రాసు, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయాల్లో విద్య నభ్యసించాడు. మద్రాసు, ఆంధ్ర, టెహరాన్ విశ్వవిద్యాలయాల్లో సంస్కృతా చార్యుడిగా పనిచేశాడు. వైదిక సాహిత్యంలో నిశితమైన పరిశోధనలు చేసి వేదాలపై అమూల్యమైన రచనలు వెలువరించారు. 1. ASYAVAMASYA HYMN (అస్యవామస్య సూక్తం, 1956), 2. VEDAS (వేదాలు, 1957), 3. THE QUINTESSENCE OF THE RIGVEDA (ఋగ్వేదసారం, 1964), 4. POET-PHILOSOPHERS OF THE RIGVEDA (ఋగ్వేదంలోని కవి దార్శనికులు, 1963). ఈ రచనలద్వారా ఆయన వేదాలపై వినూత్న కాంతిని ప్రసరింపజేశారు. కొత్త భావాల్ని వెల్లడించారు. డా॥ సి. కున్హన్ రాజా వేదాలపై చేసిన పరిశోధనలను గురించి నార్ల వెంకటేశ్వరరావు ఇలా అన్నారు : ''వేదాలను గురించి, వేదకాలం ప్రజల గురించి మిడి మిడి జ్ఞానంతో మాట్లాడేవారి మాటలకు విరుద్ధంగా, ఆర్ష విజ్ఞానాన్ని గురించి, దానిలోగల ఆధ్యాత్మిక సంపద గురించి లేనిపోని గొప్పలకు పోయే వారి వ్రాతలకు వ్యతిరేకంగా, ఆయన అనేక విషయాలు వ్రాశారు. ఆయన వ్రాసిన ప్రతి దానితో నేను ఏకీభవించలేను గాని, కొన్ని నిజాలను కుండ బద్దలుగొట్టినట్టు చెప్పినందుకు ఆయనను హర్షిస్తాను''. ఇదేవిధంగా భారతీయ తత్వవేత్త ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి వేదాలపై వెలువరించిన ఒక గ్రంథంలో డా॥ సి. కున్హన్ రాజా వేదాలపై చేసిన కృషిని ప్రశంసించటమే కాకుండా, వేదాలగురించి ఆయనతో చేసిన అనేక చర్చలు వేదాధ్యయనంలో తనకు తోడ్పడమే కాకుండా, ఆ చర్చలు తనకెంతో ప్రేరణ కలిగించాయని ప్రత్యేకంగా పేర్కొన్నారు. వేదాలపై డా॥ సి. కున్హన్ రాజా చేసిన నిష్పక్షిక పరిశోధనల ద్వారా అన్నివర్గాల మేధావుల ప్రశంస లందుకొన్నారు. మన సంస్కృత పండితుల్లో ఇటువంటి నిష్పక్షిక దృష్టి ఉండటం అరుదైన విషయం.

''వైదిక సాంఖ్యానికి ఆ తర్వాత సాంఖ్యానికి తేడా స్వల్పం. అదినుండి సాంఖ్యం నాస్తికమే. నా వాదన ఏమిటంటే, సాంఖ్యానికే కాక, న్యాయ వేదాంతాలకు, తాంత్రిక వాదానికి కూడా ఋగ్వేదంలో బీజాలున్నాయి. నాదబ్రహ్మ భావన తాంత్రిక ధోరణికి మూలం'' అన్నాడు డా॥ సి. కున్హన్ రాజా. ఈమాటలు అన్నీ వేదాల్లోనే వున్నాయనే సాంప్రదాయ ధోరణికి ప్రతిధ్వని కాదా అని ఎవరయినా ప్రశ్నించవచ్చు. నిజానికి ఆయన ఇటువంటి ధోరణికి పూర్తిగా భిన్నమైన వ్యక్తిత్వం గలవాడు. వేదాల్ని ఆధ్యాత్మిక సంస్కృతికి నిలయాలుగా భావించే వారికి కనువిప్పు కలిగించడమే ఆయన పరిశోధనల లక్ష్యంగా కనిపిస్తుంది. అందుకే ఆయన వేద సంస్కృతి సారాంశాన్ని గురించి ఇలా ఉద్ఘాటించాడు : ''వేద సంస్కృతి సారాంశాన్ని చెప్పవలసిందిగా నన్ను ఎవరయినా ప్రశ్నిస్తే నా ప్రత్యుత్తరం, ఈ సుందర జగత్తులో సుఖమయ జీవితం'' అని ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు. భారతీయ తత్వశాస్త్రం అంతా ఆధ్యాత్మిక మనే కట్టుకథను ఆయన ఈవిధంగా తప్పని నిరూపించాడు. తనని తాను మీమాంసావాదిగా ప్రకటించుకున్న డా॥ సి. కున్హన్ రాజా వేదాలు భౌతిక వాదధోరణికి సన్నిహితంగా వున్నాయని చెప్పడంలో ఆశ్చర్యం

లేదు. వేదాలను పరమ ప్రమాణంగా భావించే మీమాంస దర్శనం, భౌతిక ప్రపంచ వాస్తవికతను అంగీకరిస్తుంది; దేవుణ్ణి నిరాకరిస్తుంది ఆమేరకు అది భౌతికవాద ధోరణికి సన్నిహితంగా వున్నట్టు కనిపిస్తుంది. ''ది సాయిట్ - ఫిలాసఫర్స్ ఆఫ్ ది రిగ్వేద'' గ్రంథంలో వేదాలు ఆధ్యాత్మిక సంస్కృతికి నిలయాలుగా భావించేవారికి కనువిప్పు కలిగించే విధంగా ''రుగ్వేద దర్శనం భౌతికవాద వ్యతిరేకం కాదు'' (The Rigvedic Philosophy is not all anti - materialistic) అంటాడు ఆయన. అంతేకాదు ''చార్వాక దర్శనం''పై ''ఇండియన్ ఫిలసాఫికల్ క్వార్టర్లీ'' (XXXVI, No 1, 1963) లో రాసిన వ్యాసంలో ఆయన ఇంకా ఇలా అంటాడు : "It is the Charvakas who continued the throught pattern of Rigveda, and it is the later systems of Philosophy that have deviated from it (చార్వాకులే రుగ్వేద చింతనా సరళిని కొనసాగించారు. ఆ తర్వాత దార్శనిక వ్యవస్థలే ఆ ధోరణినుండి వైదొలిగాయి). ఇది పదార్థం (Matter), అది ఆత్మ (Sprit) అనే విభేదాన్ని రుగ్వేదం చూపించలేదని ఆయన అన్నాడు. అందువల్లే చార్వాకుల చింతనా ధోరణి రుగ్వేదానికి సన్నిహితంగా ఉందంటాడు. ఆ పండితుని ఈ అభిప్రాయాలన్నింటిని మనం అంగీకరించినా, అంగీకరించకపోయినా, వేదాల్ని, వేద సాహిత్యాన్ని సాంప్రదాయక ధోరణికి భిన్నంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించిన గొప్ప సంస్కృత పండితుడిగా డా॥ సి. కున్హన్ రాజాను అంగీకరించవచ్చు.

దేవతల గురువైన బృహస్పతిని చార్వాక దర్శనానికి కూడా మూలకర్తగా మన దర్శనశాస్త్ర చరిత్రకారులు భావిస్తుంటారు. రెండు భిన్న ధోరణులకు మూలకర్తగా ఒకరినే (బృహస్పతి) భావించడం మరో దేశ తత్వశాస్త్ర చరిత్రలో చూడలేమని ఇది ఎంతో ప్రాముఖ్యతగల విషయమని కూడా డా॥ సి. కున్హన్ రాజా భావించాడు. అంటే ఆయన అభిప్రాయం ప్రకారం చార్వాక దర్శనానికి చెందిన మూల బీజాలు కూడా రుగ్వేదంలో ఉన్నాయని భావించాలి. ప్రధానంగా చార్వాకులు రుగ్వేదంలోని ఆలోచనా సరళినే కొనసాగించారని, తర్వాత దర్శనాలే ఆ ఆలోచనా సరళినుండి వైదొలిగాయన్న ఆయన అభిప్రాయాన్ని ఇంతకుముందే చూశాము. అంటే వేదాల్ని, వైదిక సంస్కృతిని ఆయన పూర్తిగా లౌకిక ధోరణిగా భావించారు. వైదిక సంస్కృతిలో ఆధ్యాత్మిక ఔన్నత్యం పేరుతో ప్రచారం చేసుకోవడానికి కావాల్సిన విషయాలేమీ లేవని, ''ఈ సుందర జగత్తులో సుఖమయ జీవితం'' వేద సంస్కృతి సందేశంగా ఆయన భావించాడు. అందువల్లనే భౌతికవాద ధోరణులైన సాంఖ్య, న్యాయ దర్శనాలతోబాటు చార్వాకుల ఆలోచనా సరళికి సన్నిహితమైన జీవన విధానం రుగ్వేదంలో ఉందంటాడు ఆయన. తొలి దశలో చార్వాక దర్శనానికి మన సంస్కృతిలో వ్యతిరేకత లేదని, బౌద్ధానికి ఎలాగయితే తర్వాత కాలంలో వ్యతిరేకత ఏర్పడిందో, అదే విధంగా చార్వాక దర్శనం కూడా కొత్త ఆలోచనా రూపాల్ని సంతరించుకున్నప్పుడే భారతీయ సంస్కృతిలో వ్యతిరేకత ఎదురయిందంటాడు. ఈ అభిప్రాయాలన్నీ సాంప్రదాయకంగా ఆలోచించే వారికి వివాదాస్పదంగా కనిపించినా, ఎంతో ఆలోచనాత్మకమైనవి, పరిశీలనార్హమైనవి. డా॥ సి. కున్హన్ రాజా వెల్లడించిన ఈ వినూత్న భావాలపై తర్వాత కాలంలో మన పరిశోధకులెవ్వరూ పెద్దగా ఆసక్తి కనబరచినట్టు లేదు. సాంఖ్య కారికలకు భారతీయ దర్శనాన్ని మరో వినూత్న కోణంలో అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని, ఆవశ్యకతను డా॥ సి. కున్హన్ రాజా వేద సాహిత్యంపై చేసిన పరిశోధనలు రుజువు చేస్తున్నాయి.

# శృంగారం - సెక్సు

- సర్దేశాయి తిరుమలరావు

రాయప్రోలు అమలిన శృంగారాన్నీ భావకవిత్వాన్నీ తెచ్చారంటారు. అమలిన శృంగారం అంటే ఏమిటి? సమాస విగ్రహ వాక్యానికేంగాని మలినంకాని శృంగారం - అమలిన శృంగారం. మలినంకాని శృంగారం అంటే ఏమిటి? భార్యాభర్తల శృంగారం మలినమా అమలినమా? అమలినమేకదా! మన ప్రబంధాలలో వర్ణితాలైన సంభోగ శృంగారా లెటువంటివి? ప్రభావతీ ప్రద్యుమ్నుల, గిరికావసువుల యొక్క సంభోగ శృంగారాలు, అమలినం కాకమరేమి? అబ్బ! ఆ వర్ణనలు మరీ హారిబుల్ నేను భరించలేను కాబట్టి అవి మలినాలవుతాయా? ఆ సంభోగ వర్ణనలు కవిచేయు శిల్పరచనేకాని మరేమీకాదు. ఖజురహో, కోణార్కులోని శృంగార శిల్పాలు (మన తాపీ వారి పరిభాషలో బూతు బొమ్మలు) ఇట్టివే. ఇక ఏకత్రైవానురాగకమయిన శృంగారం మలినమను కొందాం. సహసానఖం పచ (మనుచరిత్ర) ఏవర్గం క్రిందికి వస్తుంది? ఇచటకూడా మాయా ప్రవరుడు ప్రవరుని మేకప్‌లోనే వున్నాడు. కాబట్టి ఇదికూడా మలిన శృంగారమన వీలు లేదు. ఇక ఉత్తరరామాయణంలోని రావణ రంభల రాక్షసరతి మలిన శృంగారంలోనికి రావాలి. ఎందు కంటే ఇది రేప్. ఇంకొకరకం సంభోగ శృంగారం వుంది. వీరేశలింగం అభాగ్యోపాఖ్యానంలో వికారంగా వర్ణించబడ్డది. ఇది కులటా శృంగారం. విశ్వనాథవారి నవలల్లో, ఈ నిషిద్ధ ప్రణయం విస్తారంగా వస్తుంది. విశ్వసాహిత్యంలో నిషిద్ధ ప్రణయంపై చాలా గొప్పగ్రంథాలే వచ్చాయి. గెటే, టాల్‌స్టాయి హార్డీ డ్రీజర్ లాంటి మహారచయితలు నిషిద్ధ ప్రణయోపేత నవలలు వ్రాసినారు. కె.యం మున్షీ 'వరణీ వసులత' అనే నవల గొప్పది. ఇదీ నిషిద్ధ ప్రణయాన్నే చిత్రిస్తుంది. కేవలం దాంపత్య శృంగారాన్ని వర్ణించిన కాంతం కథలు మంచివే అయినా గొప్పవిగా పరిగణింపబడలేదు. నిషిద్ధ వస్తువులో ఏదో ఆకర్షణ వుంది. మిల్టన్ పారడైజ్ లాస్ట్‌లోని forbidden fruit యొక్క రుచి దానికుంది. ఆదాము ఈవ్‌ల శృంగారమూ నిషిద్ధమే. మరొక శృంగారం వావివరుస లేంది. ఈడిపస్ తన తల్లితోనే సంభోగించి పిల్లల్ని కంటాడు. మరొక శృంగారం వేశ్యది. ఈమె విషయంలో పడుపుకత్తె రాక్షసరతిలో అన్న శ్రీశ్రీ వాక్యం అన్వయిస్తుంది. పొట్టకూటికై దేహం అమ్ముకుంటుంది. మరీ ఒక విభాగం అసతీ శృంగారం. చట్టవిరుద్ధంగా భార్యాస్థానం ఆక్రమించి పెత్తనం చేయు పడతులు అసతులు. 'పల్నాటి వీరచరితము'లోని నాగమ్మ అట్టిదని నా అనుమానం. చరిత్రలోను వాస్తవిక జీవితంలోను అసతులు చాలామంది కనబడతారు. కాబట్టి ఇప్పటి ప్రశ్న అమలిన శృంగారం అంటే సంభోగ వివరాలు లేని శృంగారవర్ణనా? శాస్త్రోక్త నీతిప్రకారం ఆడమగలు జరుపుకునే శృంగారము యొక్క వర్ణనా? లేదా కేవలం ఊహా ప్రణయవర్ణనా? లేదా విరహ శృంగారవర్ణనా?

పాశ్చాత్య దేశాల్లో ప్లేటోనిక్ లవ్ అనే శృంగార ధోరణి వుంది. ఒక స్త్రీని, ఊహా స్త్రీ కావచ్చు, నిజమైన స్త్రీ కావచ్చు. ఆమెను మనస్సులోనే ప్రేమించుట. మరేమీ వుండదు. శృంగారాన్ని రెండు విధాలుగా విభజించవలసి వస్తుంది. కామరతి, భావరతి. మొదటిది సాధారణంగా కావ్యాల్లో వస్తుంది. రెండవది ప్లేటోనిక్ లవ్. ఒకడు ఒక ఊహా స్త్రీతో మనస్సులో ఎంతైనా సయ్యాటలాడ వచ్చుగదా! దీనిని మలిన శృంగారమంటామా? అమలిన శృంగారమంటామా! సత్యం అనేది మనోవాక్కర్మలలో ఉండాలి కాబట్టి ఇదీ మలిన శృంగారమే. కృష్ణశాస్త్రి విరహం మలినమా అమలినమా? కృష్ణశాస్త్రి శ్రీవైష్ణవం మోజులో పడ్డతర్వాత ఆయన శృంగారంలో

లింగమార్పిడి జరిగింది. ఆయన ప్రియురాలైపోయాడు. భగవంతుడే ప్రియుడు. ఇదంతా నమ్మాళ్వారుల అనుకరణ అనుకోండి. రేణుక మనస్సులో ఏదో భావం తళుక్కున మెరిసిన దానికి జమదగ్ని ఆమెకంత కఠిన శిక్ష విధించినాడే. ఆదిశంకరుల మనస్సులోనూ, వివేకానంద మనస్సులోను శృంగారభావం ఎప్పుడూ పొడసూపలేదా? ఏదో ఒక స్త్రీమూర్తి మనస్సులో మెదలలేదా ఏమో 'హృదయ కపిమత్యంత చపలం' అని ఆదిశంకరులే అన్నారు. 'సదామోహాటవ్యాం చరతి...' ఇత్యాది. స్త్రీ సంపర్కం లేనిది శృంగారమే కాదు. రాయప్రోలు అమలిన శృంగారం తెచ్చాడంటారు.

మనకున్న అతి ఉత్కృష్ట శృంగారగ్రంథం విక్రమోర్వశీయం. ఇంగ్లీషులో వర్డ్సువర్తులాగ తెలుగులో రాయప్రోలు సామాన్యప్రజల భాషను భావాలను జీవితాలను వర్ణించినాడనవచ్చు వర్డ్సువర్తు తన Lyrical Ballads లో ఇలాగే అంటాడు. ఆయన జతగాడు కోలరిడ్జి వర్డ్సువర్తు కవిత్వంలో ఈ గుణాలు లేవని అంటాడు.

గురజాడ 21వ శతాబ్దపు కవి. Sweetness and light రాయప్రోలు కవిత్వంలో వున్నాయి. భావకవిత్వానికి గురజాడే ఆద్యుడు. గురజాడలో స్పష్టత యథార్థత ధ్యేయం వుంటాయి. రాయప్రోలు భావకవిత్వంలో అస్పష్టత, కాల్పనికత ధ్యేయరాహిత్యం ఉంటాయి. ఈ గుణాలు కొత్తగాతోచి వారిదే నిజమైన భావకవిత్వం అనిపించేట్లు చేసింది. నిజానికి భావాంబరవీథి విశ్రుత విహారిణీ అని వాగ్దేవిని సంబోధించిన పోతన మొదటి భావకవి కావలసి వస్తుంది.

సెక్సు మానవజీవితంలో విశ్వరూపం దాల్చి వుంది. వేదాలు, పురాణాలు, ఆగమాలు, కావ్యాలూ, ఇతిహాసాలు ఒక్కటేమిటి అన్నీ సెక్సుమయం. అదేదో వేరే బ్రహ్మాండమయిన అర్థ వుందని మనస్సు సమాధానపరచుకపోతే ఈ రచనలన్నిటినీ మునిసిపాలిటీ వారి చెత్తబండిల వేయవలసి వస్తుంది. 'యోనిరుదూఖలం, శిశ్నం ముసలం' ఏమి వేదం ఇది! శ్రీనాథు యజమానప్రమదా... సరేసరి. అతడొక మహాకవి: ఖజురాహో, కోణార్క దేవాలయాల మీ బూతుబొమ్మలు తంత్రశాస్త్రమండీ! శిశ్నపూజ వుండనే వుంది. శివలింగం అదే కదా! కాద అధి యూపస్తంభమనీ, భూమధ్య ధ్వజమనీ వ్యాఖ్యానాలున్నాయి. ఇది ఆదిమజాతి సంస్కృ నుండి totems నుంచీ వచ్చి వుంటుంది. మన హైందవ మతంలోనూ దైనందిన జీవితంలోన 'వీర్యం' అనేది ప్రముఖపాత్ర వహిస్తూ ఉంటుంది. ఇది సెక్సు సంబంధి. ''సహ వీర్యం కరవావహై' వీర్యం అంటే ఏమిటి? బలం అని దాటవేయవలసి వస్తుంది.

శక్తి, మాత, అంబ, భగవతిదేవి అనే పేర్లున్న స్త్రీ దేవతలు కోకొల్లలు. వీళ్ళంతా పృథ నితంబినులు. పీనపయోధరలు మళ్ళా సెక్సు సింబల్లు. Maternal erotic అనేది ఒకటుంది ఫ్రాయిడ్ ఈడిపస్ కాంప్లెక్సు అనే భావప్రక్రియ, మరొకటి ఎలక్ట్రా కాంప్లెక్సు. ఎలక్ట్రా అ స్త్రీ తన తండ్రి ఎగమెమ్నన్ మీది పక్షపాతంతో తన తల్లినే (ఎగమెమ్నన్ భార్యను) క్లైతమ్నెస్ట్రాను చంపివేస్తుంది. ఇచట కూతురుకు తండ్రిపై subconscious లో మమకార ఉన్నట్లు లెక్క. భారతీయ కుటుంబాలలో అత్తపోరుకిదే సెక్సు సైకాలజీ కారణం. వదినామ మలు, సోదరీ సోదరుల మధ్య సెక్సు subtle గా ఉండడాన్ని అరికట్టేందుకు మనపూర్వు వాలా కట్టుదిట్టాలు చేసినారు. రామాయణం అంతా, వదినామరదుల సంబంధాన్ని regulat చేయడానికి వ్రాయబడిందనవచ్చు. మన అట్లతద్దిలాంటి పండుగలు సోదరీసోదరుల సంబంధాన్ని పవిత్రీకరించుటకేర్పడ్డవి. ఈ శృంగారాన్ని sublimate చేయడంలోనే మానవత్వం వుంది. ఆ మానవత్వంను పెంపొందించడమే మేధావుల, పరిణత బుద్ధుల కర్తవ్యం. ★

# రేఖలు - ప్రాముఖ్యము

- మాకినీడి సూర్యభాస్కర్

దృశ్య జగతిలో ఒక వస్తువును మనం గుర్తిస్తున్నాం అంటే కారణం దానికొక రూపమంటూ ఉండడం. ఏ వస్తువుకైనా రూపమనేది కొన్ని రేఖలతో ఏర్పడుతుంది. చెట్టు నిలువుగా, పువ్వులు గుండ్రంగా... యిలా అన్ని వస్తువులను మనం రేఖా నిర్మితమైన రూపాల్లోనే గుర్తిస్తాం. స్థూలంగా రేఖలు రెండు రకాలు: సరళరేఖలు, వక్రరేఖలు. కొన్ని రూపాలు సరళరేఖలతో ఏర్పడితే, కొన్ని వక్రరేఖలతో ఏర్పడతాయి. మరికొన్ని రూపాలు సరళరేఖలు, వక్రరేఖలు - రెంటితోనూ ఏర్పడతాయి. ఈ విధంగా రేఖలతో ఏర్పడిన రూపాలు మూడు. ఇవే ప్రాథమిక రూపాలు - ఘన, స్థూప, గోళాకృతులు.

ఘనరూపం జడరూపం. కదలలేదు, మెదలలేదు. ఘనరూపంలోనున్న వస్తువు ఉన్నచోటనే ఉంటుంది కాని చలించలేదు. ఇది పరిణామం చెందని ఆదిమరూపం. స్థూపాకృతి ఘనాకృతికన్న కొంత చైతన్యవంతమైనది. ఎందుకంటే స్థూపం దొర్లగలదు. అటుప్రక్కకు, ఇటు ప్రక్కకు దొర్లగలదే కాని అన్నివైపులకు దొర్లలేదు స్థూపం. అంటే, ఘనాకృతి కంటె స్థూపాకృతి కొంత చైతన్యవంతమైనా, దానికి కొన్ని పరిమితులు యింకా ఉన్నాయి. ఏ పరిమితులూ లేనిది గోళాకృతి. గోళం చలించడానికి ఏ అడ్డంకులూ లేవు. నిలువుగా, అడ్డంగా, అటువైపుకూ, యిటువైపుకూ, పైకీ, క్రిందికీ, ఆమాటకొస్తే అన్నివైపులకు పోగలదు గోళం.

పూర్తిగా స్థితిశీలమైనది ఘనాకృతి. అయితే కొంత స్థితిశీలమూ, కొంత గతిశీలమూ అయినది స్థూపం; పూర్ణగతిశీలమైనది గోళం. గతిశీలకంగా రూపం ఘనం నుంచి గోళానికి పరిణతి చెందింది. ఈ గతిపరిణామం ఆయా రూపాలలో నున్న రేఖల వైవిధ్యాన్ని బట్టే కలుగుతుంది. ఘనాకృతిలో రేఖలన్నీ సరళరేఖలు. ఈ రేఖలతో ఏర్పడిన మూలాలు, కోణాలు మాదిరి ఉంటాయి. అందుకే వస్తువు కదలలేదు. స్థూపాకృతిలో సరళరేఖలతోపాటు కొన్ని వక్రరేఖలు (స్థూపం వలయాకారంగా ఉంటుంది కాబట్టి) ఉంటాయి. వక్రరేఖలతో ఏర్పడిన మూలలు వర్తులంగా ఉంటాయి. అందుకే ఆ వస్తువులో చలనం కలుగుతుంది. గోళాకృతిలో సరళరేఖలు లేకుండా, పూర్తి వక్రరేఖలే ఉండడంవల్ల గతిశీలత చరమస్థాయి నందుకుంది. కాబట్టి, సరళరేఖ స్థితిశీలకమనీ, వక్రరేఖ గతిశీలకమనీ తెలుస్తోంది. అలాగే సరళరేఖ జడతను సూచిస్తే, వక్రరేఖ చైతన్యాన్ని సూచిస్తుంది.

స్థూలంగా రేఖలు సరళమనీ, వక్రమనీ అనుకొన్నా, రేఖలు వివిధ రకాలు - స్థూల, సూక్ష్మరేఖలు, ప్రస్ఫుట, అస్ఫుట రేఖలు, నిలువు, అడ్డు, మూలరేఖలు, మిశ్రమ రేఖలు... యిలా. ఒక చిత్రంలో రూపనిర్మాణం చేసే రేఖలను స్థూల రేఖలు అంటారు. అంటే ఏ రేఖలైతే లేకపోతే చిత్రంలోని వస్తువుకు రూపం ఏర్పడదో ఆ రేఖలు. సూక్ష్మరేఖలు రూపానికి అనుపానంగా వాడే రేఖలు. నిలువుగా గీసేవి నిలువురేఖలు, అడ్డంగా గీసేవి అడ్డురేఖలు, ఒక మూలనుంచి మరోమూలకు గీసేవి మూలరేఖలు. వివిధ రేఖలను కలిపి గీస్తే ఏర్పడేవి మిశ్రమరేఖలు. మూలరేఖలు నిలువు, అడ్డురేఖలు మిశ్రమరేఖలు.

ఏ చిత్రమైనా సరళ, వక్ర రేఖలు రెంటితోను నిర్మితమై ఉంటుంది. చూసేవారి కంటికీ, హృదయానికీ వక్రరేఖ యిచ్చే ఆనందం సరళరేఖ యివ్వదు. మనం చూసేటప్పుడు కనుపాపకు రెండువైపులా ఉండే కండరాలు కనుపాపను కదల్చడానికి ఉపయోగపడతాయి. ఒక వక్రరేఖను చూడాలంటే కనుపాపను ఆ రేఖతోపాటు అటూ యిటూ కదపాలి. అదే సరళరేఖను చూసేటప్పుడు కనుపాపకు అటూ యిటూ కదిలే అస్కారముండదు. అందువల్ల కండరాలు కంటిపాపను ఒక వైపుకే లేదా దిశలో నిలిపి ఉంచాలి. అందువల్ల త్వరగా అలసిపోతాయి. ఈ కారణంగా సరళేఖను చూస్తున్నప్పుడు మన కంటికి విసుగు కలుగుతుంది. అదే వక్రరేఖను చూస్తున్నప్పుడు విసుగు అనిపించదు. ఎందుకంటే, వక్రరేఖను చూసేటప్పుడు ఒకవైపు కండరం పనిచేస్తూంటే, రెండోవైపు కండరం విశ్రాంతి పొందుతుంది. అందువల్ల మనసుకు సుఖంగా ఉండి హాయిగా అనిపిస్తుంది.

రేఖకు, రేఖకు సంబంధమేమంటే - సరళరేఖకు సరళరేఖతోను, వక్రరేఖకు వక్రరేఖతోను సామరస్యం ఉంటే సరళరేఖకు, వక్రరేఖకు వ్యతిరేకత ఉంటుంది. చిత్ర రచనలో రేఖా విన్యాసం రెండు రేఖలతోను సాధింపబడితే ఆ విన్యాసం కంటికి యింపుగా, మనస్సుకు ఆహ్లాదంగా ఉంటుంది. అలాగని చిత్రరచన పూర్తిగా సరళరేఖలతోనో, లేదా పూర్తిగా వక్రరేఖలతోనో చేయకూడదని కాదు. సామరస్యం గల రేఖలను కలిపితే ఒక రకమైన రసం, సామరస్యం లేని రేఖలను కలిపితే మరొక రసం సిద్ధిస్తుంది.

రేఖల శక్తి అమోఘం. వాటి ప్రభావం మనపై ఎంతో ఉంటుంది. ఎత్తైన భవనం నుంచి దూరంగా చూసినప్పుడు మిన్ను మన్ను కలిసిన దృశ్యం మనకెంతో ప్రశాంత భావాన్ని కలిగిస్తుంది. కారణం, ఆ కలిసేచోట ఏర్పడ్డ దీర్ఘమైన క్షితిజరేఖ. అలాగే ఎత్తైన భవనం నుంచి క్రిందికి చూస్తే భయం కలుగుతుంది. కారణం, ఆ భవనం నుంచి క్రిందికి పోయే నిలువురేఖలు. రేఖలు చక్కని వంపులతో ఉంటే మనకనేక మధురోహలు కలుగుతాయి. అడ్డదిడ్డంగా, చిందరవందరగా ఉంటే గందరగోళంగా అనిపించడంతోపాటు కర్కశభావాలు కలుగుతాయి. దీనినిబట్టి రేఖలు, వాటి తీరు మనకు ఆనందాన్నో, భయాన్నో... ఏదో ఒక సంవేదనను కలిగిస్తాయనడంలో అతిశయోక్తి ఏముంది? ఈ నేపథ్యంలో రేఖాప్రతీకత, రేఖాలాలిత్యం, రేఖల అనుమేళన, రేఖావ్యత్యాసాల గురించి కొంత తెలుసుకుందాం.

**రేఖా ప్రతీకత (Linear Symbolism):** రేఖలు స్థూలంగా సరళం, వక్రం అయినా అవి పోయే దిక్కులను బట్టి నిలువు, అడ్డు, మూలరేఖలని పిలువబడతాయని అనుకున్నాం. ఆలంకారిక రీతిలో నిలువురేఖలు పురుష గుణాత్మకాలనీ, అడ్డు రేఖలు స్త్రీ గుణాత్మకాలనీ, మూలరేఖలు ఉభయ గుణాత్మకాలనీ భావించబడుతోంది. నిలువురేఖ బలానికి, గంభీరతకు, పటుత్వానికీ ప్రతీకైతే, అడ్డురేఖ శాంతికీ, సాత్వికతకు, లాలిత్యానికీ ప్రతీక. మూలరేఖ పూర్తిగా నిలువూకాదు, పూర్తిగా అడ్డమూ కాదు; కొంత నిలువూ, కొంత అడ్డం. అందువల్ల మూలరేఖలో నిలువురేఖ పటుత్వమూ, అడ్డురేఖ లాలిత్యమూ రెండూ ఉంటాయి. అందువల్ల చిత్రంలో మూలరేఖల కూర్పు (composition) అవసరం.

**రేఖాలాలిత్యం:** చిన్న సూటుకేసంత ఉండే రష్యా రేడియోకంటే, జేబులో పట్టే ట్రాన్సిస్టరు ముద్దుగా ఉంటుంది. స్థూలంకంటే సూక్ష్మంలోనే సౌందర్యముంటుంది. అలాగే స్థూలరేఖల కంటె సూక్ష్మరేఖల్లోనే సౌందర్యం అధికం. సన్నని రేఖల్లో వుండే లావణ్యం లావుపాటి రేఖల్లో ఉండదు. అలాగే పురుష సహజమైన నిలువు రేఖలు గంభీరంగా ఉంటే,

నారీ సహజమైన అడ్డురేఖలతో చిత్రానికి లాలిత్యం చేకూరుతుంది. స్థూలమైనా, సూక్ష్మమైనా, నిలువైనా, అడ్డమైనా చిత్రంలోని రేఖలు లయాత్మకంగా నృత్యం చేస్తూంటే, ఆ చిత్రం చూసేవారి మానసవీణలను మీటి మధురగీతాలను ఆలాపిస్తుంది. రూపంలో కలిపి రేఖలను తిలకించినప్పటికంటె, రూపాన్నుంచి విడదీసి చూచినప్పుడే రేఖల లాలిత్యం, వాటి గతిశీలత బాగ గోచరమౌతాయి.

**రేఖల అనుమేళన :** చిత్రరచనలో ఒక రేఖను మరొక రేఖతో మేళవించడం జాగ్రత్తగా చేయాలి. స్ఫుట రేఖలను అస్ఫుట రేఖలతోను, స్థూల రేఖలను సూక్ష్మ రేఖలతోను, సన్నని రేఖలను లావుపాటి రేఖలతోను కలిపితే రేఖలు ఒకదానికి ఒకటి అతికినట్లుగా కనిపిస్తాయి. లయాత్మకంగా కలిసిపోవు. అందువల్ల ఏ రేఖలను ఆ రేఖలతోనే మేళవించాలి. సరూప రేఖలను కలిపితే వచ్చే రమ్యత చిత్రరచనలో అసరూప రేఖలను కలిపితే లభించదు. ఈ రమ్యతను సరూపరేఖా రమ్యత అనవచ్చు.

**రేఖా వ్యత్యస్తం (Linears contrast):** చిత్రాన్ని కేవలం సరళరేఖలతో చిత్రిస్తే కంటికి విసుగు కలిగిస్తుందని తెలుసుకున్నాం. అలాగే కేవలం వక్రరేఖలతోనే చిత్రించినప్పుడు కంటికి విసుగు కలుగకపోయినా, చిత్రానికి కొంత సంచల స్వభావం సిద్ధించడంవల్లచూసేవారి మనసుకూడ కొంత సంచలంగా మారుతుంది. అందుకే సాధ్యమైనన్ని వక్రరేఖలను రచించినా, చిత్రంలో కొన్ని సరళరేఖలను కూడ చిత్రించాలి. వక్రరేఖ దగ్గర చిత్రించిన సరళరేఖతో, ఆ రెండు రేఖలలోనున్న వైరుధ్యము, విభిన్నతలవల్ల ఒకానొక రమ్యత సిద్ధిస్తుంది. ఈ రమ్యతనే రేఖావ్యత్యస్త రమ్యత అంటారు.

**రేఖాసమన్వయం (Liner Co-ordination) :** ఒక చిత్రాన్ని కేవల సరళరేఖలతోను లేదా కేవల వక్రరేఖలతోను చిత్రించవచ్చు. పూర్తిగా సరళరేఖలతో నిర్మించినప్పుడు వంపు లన్నీ కోణీయంగా ఉంటాయి. పూర్తిగా వక్రరేఖలతో నిర్మించినప్పుడు వంపులన్నీ వర్తులంగా ఉండి అలంకారికంగా ఉంటాయి. సరళరేఖలోని సరళత వక్రరేఖలోని అలంకారంతో సమన్వయతను సాధించినప్పుడు రమ్యత ద్విగుణీకరిస్తుంది.

**రేఖల పొదుపు :** సాహిత్యంలో ''అల్పాక్షర అనల్పార్థ రచన'' యన్నట్లు సాధ్యమైనన్ని తక్కువ రేఖలలో సాధ్యమైనంత ఎక్కువ రమ్యతను సాధించడం ప్రతిభగల చిత్రకారులకే చెల్లుతుంది. రేఖల పొదుపు చిత్రానికి ఎంతో విలువను పెంచుతుంది.

ప్రాచ్య చిత్రాలు రేఖా ప్రధానాలు. ప్రాచ్య విధానంలో రేఖలమధ్య రంగులను పూస్తారు. పాశ్చాత్యులు రంగుల వెలుగునీడలను సృష్టించి మూడో ఆయతనమైన లోతును తమ చిత్రాలలో దర్శింపచేస్తారు. అయితే ఈ మూడో ఆయతనపు దృష్టిక్రమాన్నీ (Perspection) రేఖావిన్యాసంతో, రేఖాపాతంతో, రేఖలను ఒకచోట బలంగాను, ఒకచోట తేలికగాను గీయడంద్వారా సాధిస్తారు ప్రాచ్య చిత్రకారులు.

ప్రతి కళయొక్క పరమలక్ష్యం సృజించడం. అనుకరించడం కాదు. అలాగే చిత్రకళ కూడా. చిత్రం చిత్రంలాగే ఉండాలి కాని వాస్తవమైన వస్తురూపంలో ఉండకూడదు. రంగుల వెలుగునీడలతో మూడవ ఆయతనాన్ని చూపినప్పుడు చిత్రం నైజగుణాన్ని కోల్పోయి వాస్తవిక వస్తు భ్రమను కలిగిస్తుంది. చిత్రం అనేది పొడవు, వెడల్పు రెండు ఆయతనాల్లోనే ఉంటుంది. ఉండాలి. దీనికి రేఖలు ఎంతగానో తోడ్పడతాయి. ఈ విధంగా రేఖలు చిత్రకళ నైజాన్ని, శుద్ధతను కాపాడతాయి. ★

# భారతదేశంలో కులవ్యవస్థ: పుట్టుపూర్వోత్తరాలు

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, నాగార్జున యూనివర్సిటీ బౌద్ధ కేంద్రం, మాజీ అధ్యాపకులు
స్వర్గీయ బి.ఎస్.ఎల్. హనుమంతరావు గారి ప్రారంభోపన్యాసంలో కొన్ని భాగాలు

## కుల వ్యవస్థ గురించి అపోహలు :

ముందు ఈ సమస్య గురించి ఆలోచించడానికి పూర్వం ఈ కులాలు యెలా వచ్చాయి? నేను ప్రాయికంగా చరిత్ర విద్యార్థిని. మనలో చాలా మందికి, విద్యావంతులకు కూడా, మన సమాజాన్ని గురించి అనేక అపోహలు, అనేక దురభిప్రాయాలు ఉంటూ వున్నాయి. సాధారణంగా, ఈ కుల వ్యవస్థను ఆర్యులు మన దేశంలోకి తీసుకువచ్చారనీ, అనార్యులైన వారిని తమకు బానిసలుగా చేసుకోవడానికి ప్రయత్నించారనీ, ఈ ఆర్యులలో ఉన్న పూజారులు ఆధిపత్యం వహించి, ఈ కులవ్యవస్థకు దైవత్వం ఆపాదించి ప్రజల నోళ్ళు మూశారనీ ఒక దురభిప్రాయం ఉంది. 1992 'కమ్యూనిజం' పత్రిక నిర్వహించిన అధ్యయన సదస్సులో కొన్ని భాగాలు.

## సమాజ పరిణామం : పని విభజన

ప్రతి నాగరిక సమాజ (Settled Society) పూర్వదశలోనూ ఒకప్పుడు సమాజం, మానవజాతి సంచార దశలో ఉండేది. ఆహార సంపాదన నిమిత్తం ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి సంచారం చేస్తూ ఉండేది. అటువంటి దశను విడిచిపెట్టి, గ్రామాలలో నివాసాలు ఏర్పాటు చేసుకున్న తరువాత, ఆర్థిక వ్యవస్థ కొంత క్లిష్టరూపాన్ని ధరించిన తరువాత, వ్యవసాయం మున్నగు వృత్తులు వచ్చిన తరువాత, వ్యవసాయంతో పాటు అనేక వృత్తులు వచ్చిన తరువాత - అందులో కమ్మరం, కుమ్మరం, వడ్రంగం ఇటువంటి వృత్తులు వస్తాయి - వ్యవసాయంతోపాటు, ఆ వృత్తులు వచ్చినపుడు, సమాజంలో వృత్తి విభజన జరగటం సర్వసాధారణమైన పరిణామం. అలాగే జరిగింది. గ్రీస్‌లో చాలా ప్రాచీనమైన నాగరికత ఉంది. అందులోను అలాగే జరిగింది. చైనాలోను అలాగే జరిగింది. వృత్తిని బట్టి సమాజ - విభజన జరుగుతుంది. అది వృత్తి విభజన. అప్పుడు కులాలు అనే ప్రసక్తిలేదు, వర్ణాలు అన్న ప్రసక్తి లేదు.

## భారతదేశ ప్రాచీన నాగరికత : హరప్ప

మానవుడికి రెండు లక్షణాలున్నాయి. ఒకటి భయం. రెండవది ఆశ. ఈ రెండు మానసిక అవస్థలవల్ల మతం అనేది పుట్టుకొనివచ్చింది. మతం ఎప్పుడైతే వచ్చిందో అప్పుడు ''పూజారి'' వర్గం ఒకటి పుట్టుకొనివస్తుంది. ఈ పూజారి వర్గం చేసేది ఏమంటే మానవునిలోని రెండు బలహీనతలను - ఒకటి ఆశ; రెండవది భయం - ఈ రెండు మానసిక పరిస్థితులను అతడు అవకాశంగా తీసుకొని మనుషులను దోచుకుంటూ వుంటాడు. ఇది సాధారణంగా ప్రతి సమాజంలోను ఉండేదే. అది మన భారతీయ సమాజానికి ప్రత్యేకించి నటువంటి లక్షణం ఏమీ కాదు.

## ఆర్యులు రాకముందే వృత్తి విభజన

అతి ప్రాచీనమై నటువంటి నాగరికత భారతదేశములో ఉన్న సంగతి అందరికీ తెలిసిందే. అది సింధు నాగరికత. దానిని హరప్ప సంస్కృతి అంటూ ఉంటాం. ఈ హరప్ప సంస్కృతిలోనే మనకు వృత్తిపరమైన సాంఘిక విభజన కనిపిస్తుంది. అక్కడే పూజారి వర్గం కూడా వుంది. వీరి తరువాత ఆర్యులు మన దేశానికి వచ్చారు. ఆర్యులు ఎలా వచ్చిందీ, ఎప్పుడు వచ్చిందీ అనే విషయంలోకి మనం

ఇప్పుడు వెళ్ళడం సాధ్యంకాదు. మొత్తానికి వచ్చారు. వారు ఒక్కసారిగా రాలేదని చెబుతున్నారు ఇటీవల చరిత్రకారులు. తడవలు తడవలుగా వచ్చారు. ఒక తరంగం (Wave) తరువాత ఇంకొక తరంగంగా వారు వచ్చారు. ఆర్యులు అప్పుడు సంచార జీవనులు. ఇటీవల ఒక పురాతత్వవేత్త ఆల్బిన్ అనే అతడు ''భారతీయ నాగరికత ఆవిర్భావం'' (The birth of Indian Civilization) అనే పుస్తకంలో ఆర్యుల గురించి వ్రాస్తూ వారిని గుర్రాలపై స్వారీచేస్తూ వచ్చిన ఇండో యూరోపియన్ బర్బరులు (Horse riding Indo-European barbarians) అన్నాడు. ఆర్యులు అనే మాట చూస్తే అది చాలా గంభీరంగా, చాలా గొప్ప నాగరికత వున్న వారు అనే అభిప్రాయం మన మనస్సులలో పడిపోయింది. అతడు యిలా అన్నాడు (Horse riding of Indo-European Barbarians) అని అంటే చాలా అనాగరిక దశలో ఉన్న, వాళ్ళు సంచార దశలో ఉన్నటువంటి వాళ్ళు.

గ్రీసు చరిత్రలో ఒక సంఘటన ఉంది. అది, రోమన్‌లకంటే గ్రీకులది ఎక్కువ నాగరికత; అని ఉదాత్తమైన నాగరికత అని. The Conquering Romans - రోమనులు గ్రీకులను జయించారు. The Conquering Romans were Conquered by the Culture of the Conquered Greeks. విజితులైన గ్రీకుల నాగరికత సంస్కృతులు, విజేతలయిన రోమనులను జయించాయి అని అర్థం. అదే విధంగా The Conquering Aryans were conquered by the Harappa Culture of the Conquered Peoples. ఆర్యులలో, వారు సంచారక దశలో ఉన్నప్పుడు వారిలో నిర్దుష్టమైన, నిర్దిష్టమైన సంస్థలు ఏర్పడడానికి అవకాశం లేదు. అదే విధంగా ఈ పూజారి వర్గం కూడా ఆర్యులలో లేదు. అయితే వాళ్ళు యజ్ఞాలు చేసేవారు. వాళ్ళలో కవులు (Poets) ఉండేవారు కాని పురోహిత వర్గం (Priests) లేదు. సర్వసాధారణంగా చాలామంది దీనిని ఉదహరిస్తూ ఉంటారు. ఆర్యులలో ఈ కుల వ్యవస్థ లేదు అని చెప్పడానికి ఒక వాక్యాన్ని ఉదహరిస్తూ వుంటారు. ఒక వ్యక్తి యిలా చెబుతాడు: ''నేను కవిని, నా తండ్రి వైద్యుడు; నా తల్లి ధాన్యం దంచుతుంది. డబ్బుకోసం మా కుటుంబంలో సభ్యులం మేము వేర్వేరు వృత్తులు అవలంబిస్తాము'' అని చెప్పాడు. అతడు తాను కవినని చెప్పాడు గాని పురోహితుణ్ణని చెప్పలేదు. అంటే కవిత్వం వ్రాసి లేక ప్రార్థనా శ్లోకాలు వ్రాసి అమ్ముకొని జీవించేవాడు.

## హరప్ప నాగరికత : పూజారి వర్గం

కున్హన్‌రాజా అని ఆంధ్రా యూనివర్సిటీలో ఒక పెద్ద సంస్కృత అధ్యాపకుడు ఉండేవాడు. ఆయన ''వేద'' అనే పుస్తకం వ్రాశాడు. అందులో ఆర్యులలో పూజారులు లేరు. మొదట వచ్చిన ఆర్యులలోను లేరు. కాని హరప్పా ప్రజలలో పూజారులు ఉన్నారు'' అని చెప్పాడు. చాలా మంది చరిత్ర పుస్తకాలు చూచి ఉంటారు. అసలు హరప్పా ప్రజలను పూజారి వర్గమే పరిపాలిస్తూ ఉండేది అని. పురోహిత పెత్తందారీ వర్గమే ప్రజలను పరిపాలిస్తూ ఉండేది.

ఇక్కడ పూజారి వర్గం ఉండేదని చెప్పడానికి మనకి పురావస్తు విశేషంగా, శాస్త్రరీత్యా ఒక ఆధారం (Archaeological evidence) లభించింది. ఒక బొమ్మ దొరికింది. ఆ బొమ్మకు మీసాలు లేవు. తలమీద జుట్టు లేదు. గడ్డం పెరిగి ఉంది మీరు కొంచెం ప్రామాణికమైన చరిత్ర పుస్తకాలు చూడండి, ఈ బొమ్మ కనిపిస్తుంది. హిందూ ధర్మంలో కూడా, ఇటీవల హిందూ ధర్మంలోకూడా ప్రతిష్ఠమత కార్యం చేసేటప్పుడు ''కేశ, శ్మశ్రూన్ వాపయత్వా'' మీసాలు, గడ్డాలు తీసెయ్యాలి అని ఉంది. ఈ సంప్రదాయాన్ని హరప్పా ప్రజల దగ్గరనుండి ఆ తరువాత ఆర్యులు అవలంబించారు. అంతేకాకుండా ఆ బొమ్మలో మరొక విశేషం ఉంది. ఆ పూజారి ఒక ఉత్తరీయం వేసుకుంటాడు. ఆ ఉత్తరీయం,

జంధ్యం ఉన్న స్థానంలో ఉంటుంది. ఆ ఉత్తరీయం మీద కళావరుచుక్కలు (Tri-foil Mark Symbols) వుంటాయి. మూడు ముళ్ళు యజ్ఞోపవీతానికి ఉంటాయి. వాటికి ఇవి చిహ్నాలు. వాడు ఒక విలక్షణమైన పురోహితుడు. ఈ పూజారి వ్యవస్థను ఆర్యులు హరప్పా ప్రజల దగ్గరనుండి తీసుకొని దానిని పెంపొందించారు.

## విశ్వామిత్రుడు మొదటి పూజారి

మనలో ఉన్న దురభిప్రాయాల గురించి చెప్పడానికి మరొక ఉదాహరణ కూడా చెబుతాను. మన చరిత్రలో మొట్టమొదటి పూజారి వశిష్ఠుడు కాదు, విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు మొట్టమొదట ఒక బ్రాహ్మణుడు, అతడు యెప్పటివాడు? అతి ప్రాచీన వైదిక కాలంలో సుదాసుడు అనే వాడు పదిమంది రాజకూటమిని ఓడిస్తాడు. (''దాశరాజ యుద్ధము'' అనే ఆ యుద్ధం చాలా ప్రాచీన వైదిక కాలంలో జరిగిన యుద్ధం.) అతనికి విశ్వామిత్రుడు పూజారి. విశ్వామిత్రుడు ఆర్యుడా? కాదు, అతడు అసురుడు. అసురుడంటే రాక్షసుడని కాదు. అస్సీరియన్ జాతివాడు. బెనర్జీ శాస్త్రి అనే ఆయన బెనారెస్ హిందూ యూనివర్సిటీలో సంస్కృత అధ్యాపకుడున్నాడు. ఆయన ''అసుర - ఇండియా'' అనే పుస్తకం వ్రాశాడు. ఆ పుస్తకంలో ఈ విశ్వామిత్రుడు మొదలైన వారు ''అస్సీరియన్స్ - అసురులు'' అని వ్రాశాడు. విశ్వామిత్రుడు ఆర్యుడు కాదు. క్షత్రియుడూ కాదు. విశ్వామిత్రుడు మనదేశంలో మొట్టమొదట తెలిసినటువంటి పూజారి. వశిష్ఠుడు తరువాత వస్తాడు. ఈ సుదాసుడే విశ్వామిత్రుణ్ణి తొలగిస్తాడు. ఎందుకంటే విశ్వామిత్రుడు అహంకారంతో వ్యవహరించి ఉంటాడు. దానికి కూడా ఒక కారణం - ఆర్థిక, రాజకీయ కారణం ఉంది. నాటి వరకు పూజారులు హరప్పా సంస్కృతిలో పరిపాలకులుగా ఉండేవారు. బహుశా అదే సంప్రదాయంలో ఈ విశ్వామిత్రుడు నేను పెద్ద అధికారిని అని చెప్పి వాదించి ఉంటాడు. రాజుకు పురోహితునకు మధ్య సంఘర్షణ, వైరుధ్యం (The conflict between the Prince and the Priest) జరిగినట్లుగా కనిపిస్తుంది. అది వేదకాలంలోనే, సుదాసుని కాలంలోనే ప్రారంభమైంది. కొంచెం అహంకారంగా ప్రవర్తించడంవల్ల, అధికారాన్ని కావాలని అడగడం వల్ల ఈ విశ్వామిత్రుణ్ణి తొలగించి వశిష్ఠుణ్ణి పూజారిగా చేసుకొని ఉంటారు. అదీ ఈ విశ్వామిత్రుడు - వశిష్ఠుల మధ్య కలహానికి కారణం. ఇది రెండు పురోహిత వర్గాల మధ్య సంఘర్షణ (A conflict between two Priestly classes - a conflict between the Prince and the Priest)

## వశిష్ఠుడు ఎవరు?

అంతేకాని విశ్వామిత్రుడు మొదట క్షత్రియుడై, వశిష్ఠుడు బ్రాహ్మణుడై ఇది బ్రాహ్మణ - క్షత్రియ పోరాటం కాదు. వశిష్ఠుడు ఎవరు? ఆర్యుడా? కాదు. కనీసం విశ్వామిత్రుడు అసురుడని మనకు తెలుస్తుంది. వశిష్ఠుని యొక్క పుట్టుక సంగతి మనకు తెలియదు. వశిష్ఠుని పుట్టుక గురించి రెండు సంప్రదాయాలున్నాయి. ఒకటి; ఇతడు ఊర్వశి కుమారుడు అని ఉంది. కాని తండ్రి ఎవరో తెలియదు. మరియొక సంప్రదాయం ప్రకారం ఇతనికి ఇద్దరు తండ్రులు. మిత్ర-వరుణ అనేవారు. కాని తల్లి యెవరో తెలియదు. ఒకవైపున తండ్రి యెవరో తెలియదు. మరియొక వైపున తల్లి యెవరో తెలియదు. ఈ మిత్ర-వరుణులు ఇద్దరు కూడా అసురులు. తరువాత వైదిక దేవతలు అయినారు.

ఈ విధంగా మనదేశంలో ఈ పూజారి వ్యవస్థ అనేది, ఒక రకంగా బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు లేక కులాలుగా ఏర్పడినాయి. ఇది వైదిక యుగంలో జరిగిన పరిణామం. క్రమంగా ఇటువంటి విశేషాలు ఇంకా చాలా ఉన్నాయి. అనార్యుల నుండి ఆర్యులు పూజారి వ్యవస్థను సంక్రమింపజేసుకున్నారు.

అధర్వవేదంలో కేశి, ముని అనే వాళ్ళు కనబడతారు వారు కూడ అనార్యపూజారులే. వారిని ''వ్రాత్య'' అనేవారు. పంచవింశ బ్రాహ్మణంలో ''వ్రాత్యస్తోమ'' అంటే వ్రాత్యులైన వారిని, అనార్యులైన వారిని ఆ హోమంలో పవిత్రం చేసి వారిని ఆర్యులలో కలుపుకున్నారు. ఇందాక చెప్పాను. ఆల్చిన్ అనే భార్యభర్తలిద్దరు పెద్ద పురాతత్వ వేత్తలు. వారు వ్రాసిన పుస్తకంలో ఋగ్వేదం శతాబ్దాల తరబడి ఆర్యుల - అనార్యుల మధ్య సహకార ఫలితంగా ఉద్భవించింది. (It is the result of Centuries of cooperation between the Aryans and Non Aryans)

## ఆర్య-అనార్య సహకారం ఫలితమే ఋగ్వేదం

ఆర్యులు అనార్యుల మధ్య పరస్పర సహకారం వల్ల ఋగ్వేదం తయారైంది. వైదిక వాఙ్మయం అంతా అలాగే తయారైంది. ఇది ఆర్య-అనార్యుల మధ్య సహకార కృషివల్ల ఈ భావాలు, సిద్ధాంతాలు మార్చుకోవడంవల్ల ఈ వైదిక వాఙ్మయం అంతా ఏర్పడింది. దీనికి ఒక ఉదాహరణ : వైదిక వాఙ్మయాన్ని సంకలనం చేసినవాడు ఎవరని మనం చెప్పుకుంటాం? అతడు వ్యాసుడు. వ్యాసుడు ఎవరు? అతని తండ్రి ఆర్యుడు. తల్లి కైవర్త అంటే ఒక బెస్తస్త్రీ (He is of Mixed orgion) అంటే ఆర్యఅనార్య సంపర్కం వల్ల వాళ్ళ సహకారంలో వైదిక వాఙ్మయం అంతా ఏర్పడి రూపొందిందని చెప్పడానికి సూచన

ఈ హరప్పా సమాజంలోనే పూజారులు ఉండేవారు. అంతేకాక వర్తకులు రైతులు ఈ వర్గాలు కూడ ఉండేవి. దీని గురించి యింకా చాలా తర్జన భర్జనలు చరిత్రకారులలో చర్చలు కొనసాగుతున్నాయి. సామాజిక శాస్త్రవేత్తలలో, మానుష శాస్త్రజ్ఞులలో (ఆంథ్రోపాలజిస్టులు) ఒక నిర్ణయానికి ఇంకా రాలేకుండా ఉన్నారు.

## ఆర్య - అనార్య మిశ్రమం

అప్పుడు ఉన్నటువంటివి కులాలా? వర్గాలా? కొందరు వీటిని కులాలు అంటున్నారు. మరికొందరు వీటిని కులాలు కావు, వర్గాలంటున్నారు. ఈ వర్గాల పుట్టుక హరప్ప సంస్కృతిలో జరిగిందని ఒక సిద్ధాంతం. కాదు ఇవి కులాలకు మూలమైనాయి అని మరొక సిద్ధాంతం. ఏమైనప్పటికీ వృత్తిపరమైన సామాజిక విభజన, హరప్పకాలంలో కనిపిస్తుంది. చివరకు బానిసలు కూడా హరప్ప ప్రజలలో ఉండేవాళ్ళు. దానికి ఒక పురాతత్వ సాక్ష్యం లభిస్తాంది. మొహంజొదారోలో ఒక చోట చాలా చిన్న చిన్న ఇళ్ళున్నాయి. రెండు చిన్న గదులున్న ఇళ్ళు అవి. ఆ గదులు ప్రక్కన ధాన్యం దంచేవి - ఆ రోజుల్లో దంచడంరాలేదు. గానుగ ఆడేవారు - ధాన్యాన్ని పిండిగా చేసే ఒక సాధనం ఉండేది. ఇందులో నివసించేవారు బానిసలు అనీ, వాళ్ళు ఈ పట్టణాలకు ఈ ధాన్యాన్ని దంచి సరఫరా చస్తూంటారని! రొమిలా థాపర్ అనే చరిత్రకారిణి. అంటరానితనం అనేది కూడా అప్పుడే ప్రారంభమైంది అనే సిద్ధాంతం లేవదీశారు. దీనికి ఈ వృత్తిపరమైన విభజనకు ఆర్యులు ''వర్ణ'' అనే భావాన్ని కల్పించారు. ఆర్యులలో వర్ణభావన ఎక్కువగా ఉండేది. ఎందుకంటే ఆర్యులు తెల్లగా ఉండేవారు. స్థానికులు నల్లవారుగా వుండేవారు. వీరిని వర్ణించేటప్పుడు ''కృష్ణవర్ణః, కృష్ణత్వచః'' అని. ''దాసవర్ణః'' అంటే వాళ్ళ వర్ణానికి భిన్నమైన వర్ణంలో ఉండేటటువంటివారు. అయితే వీరందరూ కలిసిపోయారు. ఎప్పుడు కలిసిపోయారు? తొలివేద యుగంలోనే కలిసిపోయారు. సుదాసు అనే పేరు చూడండి. అందులో దాస పదం - ఆర్య - దాస సాంకర్యానికి నిదర్శనం. వీరి తాతగారు దివోదాసుడు కాబట్టి,

ఆదిమ వైదిక యుగంలోనే ఈ ఆర్య-దాస జాతి సాంకర్యం జరిగింది. అవి వర్ణాలు కావు. జాతులు, తెగలు, తెగల సాంకర్యం జరిగింది.

## ఆర్యులలో మొదట మూడే వర్ణాలు

మొట్టమొదట ఆర్యులలో మూడే వర్ణాలుండేవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య. ఈ వైశ్యులే సమాజంలో ఉండే అన్ని పనులు చేసేవారు. వారే వ్యవసాయం చేసేవారు. వాణిజ్యం చేసేవారు. మిగిలిన ఈ వడ్రంగం మొదలైన వృత్తులు కూడా వారే చేసేవారు. ''విన్'', అనే మాటకు అసలు అర్థం ''ప్రజ'' అని. క్షత్రియులు బ్రాహ్మణులు పూజారులుకాని వారందరు మిగిలిన ప్రజ. అంతేకాని విన్-వైశ్య అనే మాటకు వేరే అర్థం ఏమీ లేదు. వారు ప్రజలు. ఆ ప్రజలే మిగిలిన వృత్తులన్నీ అనుసరిస్తూ ఉండేవారు.

బ్రహ్మోవర్తం అంటే ఆర్యులు మొట్టమొదట వచ్చి నివసించినచోటు. పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల ప్రాంతాన్ని బ్రహ్మోవర్తము అన్నారు. (The original settlement of the Aryans) అక్కడ నుండి క్రమంగా వీరు గంగా మైదానంలోకి విస్తరించారు. ఆ కాలంలో అనగా క్రీస్తుపూర్వం 800 ప్రాంతంలో ఇది జరిగింది. (1000-800 బి.సి.). ఆ కాలంలో ఆర్యులు విస్తరించడం వలన ఆర్థికంగా కొంత క్లిష్టత ఏర్పడింది. వ్యవసాయం పెరిగింది. అనేక వృత్తులు వచ్చాయి. ఈ ఆర్థిక విస్తరణకు అనార్యుల సహాయం వాళ్ళకు కావలసివచ్చింది. అప్పుడు ''శూద్ర'' వర్ణం ఏర్పడింది. శూద్రులు అంటే ఎవరు? వారూ ఆర్యులే!

శూద్రులు అంటే ఎవరు? శూద్రులు అంటే బానిసలు కాదు. అనార్యులు కాదు. శూద్ర అనే పదం ఒక జాతిపరమైన పదం. ఒక సిద్ధాంతం ప్రకారం - ఈ శూద్రులు అలలు అలలుగా ఆర్యు వచ్చినప్పుడు మొట్టమొదట వచ్చిన ఆర్యులే - శూద్రులు అనే ఒక అభిప్రాయం ఉంది. (They were also an Aryan tribe, పాండవులు, కౌరవులు గురించి కూడా ఇదేరకమైన అభిప్రాయం వుంది. కౌరవులు మొట్టమొదట వచ్చి స్థిరపడ్డారు. తరువాత పాండవులు వచ్చారు అని. ఇదే రకంగా అనేక అలలు అలలుగా, అంచల అంచలుగా ఆర్యులు మన దేశానికి వచ్చారు. మొట్టమొదట వచ్చిన ఆర్య జాతివారిపేరు శూద్రులు. భోజ, కుమర, అంధ, వృష్ణి, భరత ఇవన్నీ ఆర్యులలో ఉన్న తెగల పేర్లు. అదే విధంగా శూద్ర అనేది కూడా ఒక ఆర్య తెగ యొక్క పేరు. వారు సరస్వతి నది ఒడ్డున ఉండేవారు. సరస్వతి నది ఇప్పుడు ఇంకిపోయింది. ఇప్పుడు లేదు. అది రాజస్థాన్ మధ్య భారత్ ప్రాంతాలలో ఉండేది. ఆ నది ఒడ్డున ఉండే శూద్రులను ఆర్యులు తమలో కలుపుకున్నారు. ఆ జాతి అంతా కూడా, ఆ తెగ అంతా కూడా ఆర్యజాతిలో కలిసి శూద్ర వర్ణంగా పురుష సూక్తంలో ప్రవేశించి రుగ్వేదంలోకి ఎక్కారు. అయితే శూద్రులు, బానిసలని మనకు వాఙ్మయంలో ఎక్కడా కనబడదు. ఎక్కడైనా ఒకచోట కనిపిస్తే కన్పిస్తుంది. శూద్రులలో పశుసంపద ఉన్న శూద్రులు ఉన్నారు. భూస్వాములైన శూద్రులు న్నారు. తరువాత భిన్న చేతి వృత్తులు అనుసరించిన శూద్రులున్నారు. కాబట్టి శూద్రులను కేవలం ఈ పై మూడు వర్ణాలకు సేవ చేస్తూ వుండమని బ్రహ్మ సృష్టించినటువంటి వర్ణం కానేకాదు.

## ఆర్య, అనార్య సమ్మేళనం; బౌద్ధం కీలకపాత్ర

క్రీస్తు పూర్వం ఆరవ శతాబ్దంలో, బౌద్ధ మతం వచ్చింది. ఈ బౌద్ధమతం ఆర్య అనార్య జాతి సమ్మేళనానికి చాలా ఉపకరించింది. సంస్కృత భాషా సంస్కృతి విస్తరింపజేయడానికి ఉపకరించింది. బౌద్ధమతం ప్రబలంగా ఉన్నంతకాలం ప్రజలలో కులాల గురించిన బలమైన అభిప్రాయాలు ఉండేవి కావు. కుల చైతన్యం (caste consciousness) ఉండేది కాదు.

మన చరిత్రలో అంటే మన ఆంధ్రుల చరిత్రలో ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. అమరావతి, నాగార్జున కొండ మొదలైనవి చాలా ప్రాచీన బౌద్ధ క్షేత్రాలు. అమరావతిలో 150 శాసనాలు దొరికాయి. నాగార్జున కొండలో 70-80 శాసనాలు దొరికాయి. ఈ శాసనాలు వేటిలో కూడా కులాల గురించిన ప్రసక్తి లేదు. ఆఖరికి బ్రాహ్మణ అనే పదం కూడా మనకు కనిపించదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మొదలైన పదాలు ఏవీ ఈ శాసనంలో కనపడవు. అయితే వాటికి చాలామంది దాన ధర్మాలు చేశారు. వాటిలో వృత్తిపరమైన పేర్లున్నాయి. ''గతిక'' అంటే గంధకార అనే పేరు ఉంది. అలాగే శిల్పుల పేర్లున్నాయి. వడ్రంగుల పేర్లున్నాయి. వణిజ అనే పేరు వుంది. అంతేకాని వైశ్య అనే పదం లేదు. వణిజుడు అంటే బ్రాహ్మణుడు వణిజుడు కావచ్చు. శూద్రుడు వణిజుడు కావచ్చు. వణిజ అనే పదం ఉన్నది కాని వైశ్య అనేపదం లేదు. శూద్ర అనే పదం లేదు. బ్రాహ్మణ అనేపదం లేనే లేదు. ఇవి ఎంత వరకు? క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు! ఈ క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు ప్రజలలో కుల చైతన్యం (Caste consciousness) అనేది లేదు. అంతేకాక ఆ రోజుల్లో అస్పృశ్యత అనేది ఉన్నదా? లేదా? అన్నది అనుమానం. ఎందుచేతనంటే అమరావతి శాసనంలోనే ఒక దాంట్లో ''విధికా'' అనే చర్మకారుడు - నేను చర్మకారుణ్ని అని అతడే చెప్పుకున్నాడు-నేను పంచముణ్ణి అని చెప్పుకోలేదు. పంచమ అనే శబ్దం యొక్క అర్థాలు చాలా చెబుతున్నారు. ''పంచమజనః'' అంటే నిషాదుడు అని ఒక గ్రంథం చెప్పింది. నిషాదుడు అంటే ఒక బ్రాహ్మణునికి శూద్రస్త్రీ యందు జన్మించినవాడు అని చెప్పారు. పంచముడు అంటే మనం మాల, మాదిగ వర్ణాలు కాదు.

ఈ ''విధికా'' అనే చర్మకారుని తండ్రి పేరు ఉపాధ్యాయ. నాగ ఉపాధ్యాయ. పేర్లు చూడండి సంస్కృతం పేర్లు. ''విధిక'' అనేది సంస్కృతం పేరు. సంస్కృతం మాట. నాగ అనేది సంస్కృతం మాట. చర్మకారులు కూడా సంస్కృతం పేర్లు పెట్టుకొన్నారు. వాళ్ళు ఆ బౌద్ధ స్తూపానికి వెళ్ళి దానం చేశారు. ఇది క్రీస్తుశకంమూడవ శతాబ్దంలో జరిగినటువంటి సంఘటన. వాడొక్కడే వెళ్ళలేదు. భార్య బిడ్డలందరితోను వెళ్ళాడు. కాబట్టి క్రీస్తు శకం 300 వరకు, మన దేశంలో, ఆంధ్రదేశంలో కూడా కుల చైతన్యము అనేది లేదు. ఎలా వైదిక సమాజంలో ఆర్య అనార్య జాతుల సమ్మేళనం జరిగిందో, క్రీస్తు తరువాత మూడవ శతాబ్దంలో కూడా ఈ జాతి సాంకర్యం జరిగింది.

## ఆంధ్రుల చరిత్రలో

ఆంధ్రుల చరిత్ర చూడండి. లేక దక్షిణ దేశ చరిత్ర చూడండి. మన రాజులు చాలా మంది యజ్ఞయాగాది క్రతువులు చేసేవారు. ఉత్తర దేశంలో ఈ యజ్ఞయాగాది క్రతువులయందు ఇంత ''పిచ్చి'' లేదు. ఒక గుప్త వంశంలో సముద్రగుప్తుడు అతడి మనుమడు కుమారగుప్తుడు ఏదో ఒక అశ్వమేధం చేశామని చెప్పుకొన్నారు. దక్షిణదేశ చరిత్ర చూస్తే, మొదటి శాతవాహన చక్రవర్తి, శాతకర్ణి అనే అతడు, చాలా యజ్ఞాలు చేశాడు. రెండు అశ్వమేధాలు చేశాడు. ఏవో ఇంకా చాలా చాలా చేశాడు. అతని తరువాత దక్కనులో రాజ్యానికి వచ్చిన వాకాటక వంశంలో ప్రవరసేనుడు అనే అతడు చాలా యజ్ఞాలు చేశాడు. విష్ణుకుండినులలో మాధవ వర్మ అనే అతడు; అతనికి బెజవాడకు కూడా సంబంధము ఉందని ఒక కథలో ఉంది. ఇక్కడ దుర్గాదేవి కనకదుర్గ కావడానికి మాధవవర్మే కారణమట. ఏదైనా కానివ్వండి అతడు ''ఏకాదాశాశ్వమేధ'' పదకొండు అశ్వమేధాలు చేశాడట. 'క్రతు సహస్రయాజీ' వేయి యజ్ఞాలు చేశాడు. ఎందుకని వీళ్ళకు యింత తాపత్రయం-యజ్ఞాలు చేయాలని? ఎందుకంటే వీళ్ళు స్వతహాగా వైదిక మతస్థులు కాదు. వాళ్ళే చెప్పుకున్నారు. ''బ్రహ్మక్షత్ర తేజోభృతాం'' ''మాలో ఇటు బ్రాహ్మణుల తేజస్సు, ఇటు క్షత్రియుల తేజస్సు కూడా ఉంది. ''ఈ యజ్ఞయాగాది క్రతువులు

చేయడం వలన, పరమేష్ఠిత్వాన్ని సాధించాను. బ్రహ్మత్వాన్ని సాధించాను'' అని చెప్పుకున్నాడు. ఎందుకింత తాపత్రయం? శ్రీనాథుడు ఒక పద్యం చెబుతాడు చూడండి: ''ఆవగింజంత బూదిమై నలదెనేని వెలది గుమ్మడికాయంత వె(ర్రి)పుట్టు''. వీళ్ళు కొత్తగా బ్రాహ్మణ మతం పుచ్చుకొన్నారు. అందుచేత వీళ్ళకి బ్రాహ్మణ మతంలో తమకు శ్రద్ధ ఉన్నది అని ప్రజలకు చూపించడానికి ఇన్ని యజ్ఞయాగాలు చేశారు. ఉత్తర దేశంలో ఇంత కనుపించదు. ఇంత తాపత్రయం లేదు.

## అన్ని కులాల్లోను చేరిన ఆటవికజాతులు

క్రీస్తుశకం యెనిమిదవ శతాబ్దం వరకు ఇక్కడ ఉండే పుళిందులు, బోయలు మొదలైన వారంత ఈ కులాల్లో చేరిపోయారు. కులం అంటే ఒక్క శూద్రకులంలోనే కాదు. బ్రాహ్మణ కులం దగ్గర నుండి శూద్ర కులం వరకు ఈ అన్ని కులాల్లోను ఈ ఆటవిక జాతులవారు (ఎబోరిజనల్స్) పుళిందులు (ఒక ధర్మశాస్త్రంలో పుళిందులను ఛండాలురలో కలిపి చెప్పారు). పుల్కస, పుళింద, ఛండాల - అంటే పుళిందులను ఛండాలురతో కలిపి చెప్పారు. ఛండాలురతో పుళిందులు సమానులని చెప్పారు. తెలంగాణాలో కరీంనగర్ జిల్లా మాటేడు అనే గ్రామంలో ఒక శాసనం దొరికింది. అది పదకొండవ శతాబ్దంనాటి శాసనం. అక్కడ ''వేనుబోల'' అని పుళిందుడు ''నాది పుళింద కులము'' అని చెప్పుకున్నాడు. పుళింద అనేది ఒక తెగ. ఒక Tribe. ఆ తెగ అల్లా ఒక కులమైంది. 'మాది పుళింద కులము'' అని చెప్పుకోవడంతోనే వూరుకోలేదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలను రక్షించడానికి మా కులాన్ని, బ్రహ్మదేవుడు పుట్టించాడు అన్నాడు. అదే విధంగా బోయలు. బోయలు నెల్లూరు జిల్లాలో ఉండేవారు. ఇది క్రీస్తు శకం యెనిమిదవ శతాబ్దంనాటి సంగతి. అక్కడి శాసనాలు న్నాయి. ఒంగోలు జిల్లాలో శాసనాలు దొరికాయి. బోయలు చాలామంది అన్ని కులాల్లోను చేరారు. రుషి గోత్రాలు పెట్టుకొని బ్రాహ్మణులలో చేరారు. బోయలలో కూడా వృత్తి విభజన ఉండేది. ఆలబోయ - అంటే వాడు ఆవులను కాచుకొనేవాడు. మందుబోయ అంటే వాడు వైద్యుడు. కోవెల బోయ అంటే వాడు గుళ్ళో పురోహితుడు. ఈ గుళ్ళో పురోహితుడైనటువంటి వాడి మొదటి కొడుకు బోయ అని పేరు పెట్టుకొన్నాడు. రెండవ వాడు రెడ్డి అని పేరు పెట్టుకున్నాడు. మూడవవాడు నాయుడు అని పెట్టుకున్నాడు. నాల్గవ వాడు నాయక అని పెట్టుకొన్నాడు. మీరు (You can verify) పరిశీలించవచ్చు. బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయ శాసనాలని, ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు కూడా ప్రకటించారు. ఈ విధంగా బోయ జాతి వారు అన్ని వర్ణాలలోను చేరిపోయారు.

## కాకతీయులు ఎవరు? వారూ పుళిందులే!

ఇంకో చిన్న విషయం చెప్పి ముగిస్తాను. మన కాకతీయులు చాలా గొప్ప రాజులు అని చెప్పుకుంటాం. ఈ కాకతీయుల చరిత్ర చూసినట్లయితే వీరు మొట్ట మొదట పుళిందులు. వీరి మొట్టమొదటి రాజుల పేర్లు చూడండి. గిరియ, వెన్న, గుండయ, ప్రోలయ్య. ఇవేవీ సంస్కృతం పేర్లు కావు. ఇవన్నీ బోయలలోను, పుళిందులలోను కనిపించే పేర్లు. రుద్రదేవుడు దగ్గర నుంచి వీళ్ళు మతం మార్చుకొని బ్రాహ్మణ మతం స్వీకరించారు. అక్కడ నుండి సంస్కృతం పేర్లు కనిపిస్తాయి మనకు. గణపతి దేవుడు జాయపసేనాని చెల్లెళ్లను పెళ్ళి చేసుకున్నాడు. జాయప సేనాని యెవరు? ఇతడు బోయ. దివిసీమను పరిపాలిస్తుండే బోయ రాజు.

మిసిమి, జులై 1994

## బ్రాహ్మణులు పవిత్రులు కాదు; శూద్రులు అపవిత్రులు కాదు

ఈ రకమైన దురభిప్రాయాలు - కులాలను గురించి లేక వర్ణాల గురించి - మనలో చాలా వ్యాపించి ఉన్నాయి. ఈ దురభిప్రాయాలు తొలిగిపోవాలి. బ్రాహ్మణులు ఏమీ పవిత్రులు కాదు, శూద్రుల అంతకంటే అపవిత్రులుకారు. వాళ్ళలోను బోయలున్నారు. వీళ్ళల్లో [illegible] యోధులున్నారు. ఈ ఆటవిక జాతివారు అందరూ ఈ అన్ని కులాల్లోను చేరిపోయారు. అందుచేత ఈ కుల వ్యవస్థ యొక్క పునాదులకు వెళ్ళి చూస్తే, ఈ కులాల పట్టింపులు అనేవి అర్థం కానటువంటి విషయం. అవి తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తే కులాలు ఎప్పటికైనా మాసిపోతాయి. ఈ తేడాలు ఎలా పోవాలి? విద్య ద్వారా పోవాలి. మనం ప్రజలను విజ్ఞానవంతులను చేయాలి. కాని విద్య ఇటువంటి విజ్ఞానాన్ని ఇప్పుడు యిస్తున్నదా?

## కుల, మతరీత్యా విద్యా సంస్థలు

నన్ను క్షమించాలి. మతానికి ఒక కాలేజీ; కులానికి ఒక కాలేజీ వుంటున్నాయి. మా గుంటూరు పట్టణం తీసుకోండి. నాల్గు మతాలకు నాలుగు కాలేజీలున్నాయి. హిందూ కాలేజి, క్రిష్టియన్ కాలేజి, జైన్ కాలేజి, ముస్లిం కాలేజి వున్నాయి. అదే విధంగా కులానికొక కాలేజీ చొప్పున వున్నాయి. హిందూ కాలేజి - బ్రాహ్మణ కాలేజి అని ఒక అభిప్రాయం - కాదు నిజం కావచ్చు. అలాగే శెట్టి కాలేజి; పోలిశెట్టి సోమసుందరం - తెల్లాకుల జాలయ్య వైశ్యుల కాలేజి, చౌదరి కాలేజి - జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కాలేజి, నాయుడు కాలేజి, రెడ్డి కాలేజి ఇలా వున్నాయి. మనం విద్యావిధానం ద్వారా కుల వ్యవస్థను నిర్మూలించగలమనే ఆశ వున్నదా? విద్యలో ప్రవేశించిన ఈ కులతత్వం వల్ల అటువంటి ఆశ - భవిష్యత్తులో నెరవేరుతుంది అనే ఆశలేదు. రాజకీయ పార్టీలయొక్క ప్రధానమైన ఒక లక్ష్యం - ప్రజలను విజ్ఞానవంతులను చేయడం; రాజనీతిశాస్త్రంలో చదువుకుంటారు. ఒక రాజకీయ పార్టీయొక్క విధులు ఏమిటి? ప్రజలను విజ్ఞానవంతులను చేయడం, మరి వీరిందరూ పెద్దవారే తెలిసినవారే. కాని రాజకీయ పార్టీలు కూడా కులతత్వాలమీదనే నడుస్తున్నాయి. అటువంటప్పుడు ఈ కులతత్వాన్ని ఇంకా దేశంలో నిర్మూలించేదెవరు? ఇటు విద్యావిధానంలో కులతత్వం ప్రవేశించి దానిని నీరసింపజేసింది. ఇటు రాజకీయ పక్షాలలో కులతత్వం ప్రవేశించి ప్రజలను అజ్ఞానంలో వుంచుతున్నది. ప్రజలను ఎంత అజ్ఞానంలో వుంచితే రాజకీయ పక్షాలకు అంతమేలు. వాళ్ళు రాజకీయ అధికారంలోకి రావడానికి అంత అవకాశం వుంది అన్న విధంగా వున్నాయి.

రష్యా దేశంలో కేథరిన్ అనే మహారాణి ఉండేది. ఆమెను కేథరిన్ ది గ్రేట్ అంటారు. ఆమె తన రాజ్యంలో కాలేజీలు. హైస్కూళ్ళకు భవనాలు కట్టించింది. ఒక మంత్రిగారు వెళ్ళి "మహారాణీ! మీరు బిల్డింగులైతే కట్టిస్తున్నారు కాని అందులో ఉపాధ్యాయులు లేరు. విద్యార్థులు లేరు. ఎందుకు ఈ బిల్డింగ్స్?" అని అన్నాడట. ఆమె అన్నదట "ఈ ప్రశ్న వేయడానికి నువ్వు ఒక మూర్ఖుడవు అయివుండాలి. ప్రజలు నిజంగా విద్యావంతులైనప్పుడు నీ స్థానం వుండదు. నా స్థానమూ వుండదు." కాబట్టి మన దేశంలో వున్న రాజకీయ పార్టీలు కూడా - కమ్యూనిస్టు పార్టీవారు క్షమించాలి - ఇదే విధమైన విధానాన్ని అనుసరిస్తున్నాయా? అయినప్పుడు, ఇక కులాలు పోడానికి ఆస్కారం ఎక్కడుంది? ఇది పెద్దలు ఆలోచిస్తూనే వుంటారు. యువకులు ఆలోచించాలి. భవిష్యత్తు యువకులది. అందుచేత మీ అందరూ దీనిని జాగ్రత్తగా ఆలోచించి పరిష్కారమార్గం ఏమిటో భవిష్యత్తుకు వదలాలి. నమస్తే!

**FEED BACK**

# శ్రీ బొమ్మకంటి వ్యాసంపై ఒక అభిప్రాయం

''భారతీయ దర్శనాలు - పరిచయం'' పర్వాలేదనిపించింది. ఆయన వ్యాసంలో నా దృష్టికి రెండు పొరపాట్లు కనిపించాయి. 1. మొట్టమొదటిది భారతీయ దర్శన చరిత్ర రచయితగా మాధవాచార్యుడ్ని పేర్కొనడం. 2. హరిభద్రసూరి మతానుసారం బౌద్ధం, న్యాయం, సాంఖ్యం, జైనం, వైశేషికం, పూర్వమీమాంస అనే ఆరే షడ్దర్శనాలనడం. మాధవాచార్యుడు క్రీ.శ. 14వ శతాబ్దివాడు. షడ్దర్శన గ్రంథాన్ని రచించిన హరిభద్రుడు 9వ శతాబ్దివాడు. మాధవాచార్యుడికి పూర్వుడైన హరిభద్రుడ్నే మొట్టమొదటి భారతీయ దర్శన చరిత్ర రచయితగా పరిగణించాలి కాని మాధవాచార్యుడ్ని కాదు. హరిభద్ర సూరి బౌద్ధం, న్యాయం, సాంఖ్యం, జైనం, వైశేషికం, పూర్వమీమాంసలనే షడ్దర్శనాలుగా పేర్కొన్నారని శ్రీ బొమ్మకంటి భావిస్తున్నారు. ఇది తప్పు. ఎందుకంటే షడ్దర్శన సముచ్చయంలో హరిభద్రుడు లోకాయతాన్ని కూడా దర్శనంగా భావించి, దాని మూలసూత్రాన్ని ఏడో అధ్యాయంలో సంక్షిప్తంగా వివరించాడు. కాబట్టి బొమ్మకంటి వారు పేర్కొన్న ఆరుదర్శనాలతో బాటు లోకాయతాన్ని కూడా హరిభద్రుడు చర్చించాడు. అటువంటప్పుడు ఈ సమస్యను ఎలా పరిష్కరించాలి? షడ్దర్శన సముచ్చయంలో ఎన్ని దర్శనాలును పేర్కొన్నట్టు హరభద్రుడు. ఈ సమస్యను పరిష్కరించాలంటే Secondary Sources పై ఆధారపడకుండా మూలగ్రంథాన్ని చదవాలి. ఆపని శ్రీ బొమ్మకంటి చేయలేదని ఆ వ్యాసం చదివిన పాఠకులు గ్రహించగలరు. క్రీ శ. 9వ శతాబ్దానికి న్యాయదర్శనము నుండి వైశేషిక దర్శనము భిన్న దర్శనంగా పరిగణించబడటం లేదని హరిభద్రుడి వ్రాతలే నిరూపిస్తున్నాయి. అందువల్ల న్యాయ-వైశేషికాల్ని ఒకే దర్శనంగా పరిగణిస్తే ఆరో దర్శనం లోకాయతాన్ని పరిగణించాలి. అందుకే షడ్దర్శన సముచ్చయను సంస్కృతం నుండి ఆంగ్లంలోకి అనువాదం చేసిన ప్రొఫెసర్ కొత్త సచ్చిదానంద మూర్తి "Number of Philosophies" (దర్శనాల సంఖ్య) గురించి హరిభద్రుడి అభిప్రాయాన్ని ఇలా అనువాదం చేశారు. "Others do not recognise the difference of the Vaisesikas from the paith of the Vaiyagikas. In their opinion astika theorists are five types only. In their opinion, the number of the six philsophies is hirly completed by throwing in Lokayata" (సెకండ్ రివైజ్డ ఎడిషన్, 1986, పే. 98). కాబట్టి లోకాయతాన్ని షడ్దర్శన సముచ్చయిలో ఆరో దర్శనంగా పేర్కొన్నట్టు అంగీకరించవచ్చు. ఈ విభజనను ఒకవేళ వ్యాసరయితకు ఆమోదయోగ్యం కాకపోతే షడ్దర్శన సముచ్చయిలో లోకాయతాన్ని దర్శనంగా పరిగణించి చర్చించిన విషయాన్నయినా పేర్కొనవద్దా? అలా చేస్తే బాగుండేది. భారతీయ దర్శనాల గురించి రాసేటప్పుడు కనీసం అందుబాటులో ఉన్న ''సర్వదర్శన సంగ్రహం'', ''షడ్దర్శన సముచ్చయం'' వాటి ముఖ్యమైన గ్రంథాల్నయినా మూలంలో చూడకపోతే కొన్ని పొరపాట్లు దొర్లడానికి అవకాశం ఉంది. ఇదే విధంగా భారతీయ దర్శనాలపై రాసే మన రచయితలు మాధవాచార్యుడు ''సర్వదర్శన సంగ్రహం'' లో 16 దర్శనముల గురించి అభివర్ణించాడని రాస్తుంటారు. ''విషయసూచిక''లో మొదటి అధ్యాయంగా ''చార్వాక దర్శనం'' పదహారో అధ్యాయంగా ''వేదాంత లేక శంకరదర్శనం'' పేర్కొన్నా, శంకరాద్వైతాన్ని ఏ గ్రంథంలో చర్చించాడో ఆ గ్రంథం పేరు మాత్రం ఇవ్వలేదు. సర్వదర్శన గ్రంథాన్ని అనువాదం చేసిన ఇ.బి. కోవెల్, ఆ గ్రంథం ''పంచదశి'' కావచ్చని పాదపీఠికలో పేర్కొన్నారు. అందువల్ల ముఖ్యమైన గ్రంథాల్ని అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతయినా ఉంది. కేవలం Secondary Sources పై ఆధారపడితే ప్రయోజనం పూజ్యం తక్కువ.

- టి. రవిచంద్

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# BRANCH OFFICES

**Synonyms for safe & pleasant places for your savings**

| | | Phone Nos |
|---|---|---|
| 1 | Vidyanagar | 615192 |
| 2 | Malakpet | 528983 |
| 3. | Narayanaguda | 664909 |
| 4. | Vidyut Soudha | 220378 |
| 5. | Secunderabad | 76172 |
| 6 | Saidabad Colony | 877401 |
| 7. | Boudhanagar | 615518 |
| 8 | Himayatnagar | 232837 |
| 9 | Tarnaka | 869351 |
| 10 | Masab Tank | 225451 |
| 11. | Dilsukhnagar | 875539 |
| 12. | Charminar | 524161 |
| 13. | Baghlingampally | 668944 |
| 14 | Lothukunta | 845527 |
| 15 | Tarnaka Ext. Counter | 869308 |
| 16. | Tirupathi | 22428 |

RATES OF INTEREST ON

# DEPOSITS

| | |
|---|---|
| Current Account | — |
| Savings Account (w e f 1-7-93) | 5 25% |
| **Term Deposits (w.e.f. 1-10-93)** | |
| 46 days o 179 days | 8% |
| 180 days to 364 days | 8.50% |
| One Year & above | 10.25% |
| **NRE (Indian Rupee) Accounts** (w e f 12-10-93) | |
| Savings Account | 5% |
| **Term Deposits** | |
| 46 days to 270 days | 11% |
| 271 days to below 1 year | 10.50% |
| One year and above | 11% |




**The Andhra Pradesh State Co-op. Bank Ltd.**
(Scheduled Bank)
Troop Bazar, Hyderabad-500 001
Phone 44481-82-83
Telex 0425-6756, APCB-IN
Fax. 0091-842-44978

**APCOB : The Bank extending prompt & courteous service.**

